Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 37 • 10-9-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# రోశయ్యను మారిస్తే ఎవరు?

## ● మార్చే ఆలోచన అధిష్టానానికి వుందా?

ఎక్కడో ఏదో వీధి కొల్లబోతుంటే పంచ లెగట్టుకొని పరుగెత్తినట్లుంది రాష్ట్రంలో కాంగ్రెస్‌వాదుల పరిస్థితి ఇప్పుడు. ముఖ్యమంత్రి రోశయ్య అనారోగ్య పీడితుడు కావడం, జగన్‌ను నియంత్రించడంలో ఆయన సమర్ధత చాలక పోవడంతో అధిష్టానం నాయకత్వ మార్పు ఆలోచన చేస్తున్నదన్న వార్తలు బయటకు పొక్కినప్పటి నుంచి ఒక మోస్తరు కాంగ్రెస్ వాదులెవరికీ నిద్ర పట్టడం లేదు.

రోశయ్య గత వారం రోజులుగా తీవ్రమైన వైరల్ జ్వరంతో బాధపడుతున్నాడు. అంతకు క్రితం వారం కూడా ఆయనకు జ్వరం వచ్చింది. ఇప్పుడొస్తున్న వైరల్ జ్వరాలకు సాధారణ మనుషులే తట్టుకోలేకపోతున్నారు. 78ఏళ్ల వృద్ధాప్యంలో రోశయ్య పరిస్థితి ఏమిటో వూహించుకోవచ్చు. దానికి తోడు ఆయనకు మూత్ర సంబంధిత సమస్యలు, మధుమేహం, బ్లడ్ ప్రెజర్ రుగ్మతలు కూడా చుట్టుముట్టాయి. వీటన్నిటితో బాగా నీరసపడిపోయారాయన. కదిలే ఓపిక కూడ లేదు. అందువల్లనే 1తేది మన్నవరం బిహెచ్ఇఎల్ ఫ్యాక్టరీకి శంఖుస్థాపించను ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ తిరుపతికి వచ్చినా స్వాగతించలేకపోయాడు. ప్రధాని రాష్ట్రానికి వస్తే ముఖ్యమంత్రి ఎదురుకోలు పలకని సందర్భం రాష్ట్ర చరిత్రలో ఎప్పుడూ లేదు.

ఇంత పెద్ద రాష్ట్రాన్ని అనారోగ్యంతో బాధపడే నాయకుడి చేతిలో పెట్టడం ఎవరికీ క్షేమం కాదనే ఆలోచన అధిష్టానానికి వుందని వార్త. దానితో నాయకత్వ మార్పిడి అంశం చర్చకు వచ్చింది. అయితే రాష్ట్ర కాంగ్రెస్‌లో ముఖ్యమంత్రి కాదగిన స్థాయి, నాయకత్వ పటిమ వున్న వాడెవ్వడూ కన్పించడం లేదు. మార్పు చేస్తే ఎవరిని పెట్టాలన్నది పెద్ద సమస్య. దానితో దాదాపు ఇరవై మంది ఆశావహులు వూహా ప్రపంచంలో తేలియాడే పరిస్థితి ఏర్పడింది.

నిజానికి నాయకత్వ మార్పిడి గురించి అధిష్టానంలో ఆలోచన వుందని ఖచ్చితంగా ఎవరికీ తెలియదు. జగన్ గొడవతో అసలే అస్తుబిస్తుగా వున్న రాజకీయ వాతావరణాన్ని ముఖ్యమంత్రి మార్పుతో మరింత పాడు చేసుకొనే తెలివి తక్కువ నిర్ణయం తీసుకొంటారనీ భావించలేము. డిసెంబర్ నెలాఖరులో శ్రీకృష్ణ కమిటీ నివేదిక వెల్లడైన తర్వాత రాష్ట్రంలో ఏర్పడబోయే అశాంతి ఒకటి అందరి మనసులను తొలుస్తున్నది. ఆ అసమ్మతిని చల్లార్చడానికి అసెంబ్లీ రద్దు చేసి, రాష్ట్రపతి పాలన పెడతారని, అప్పటివరకు కుంటి గుర్రమని తెలిసినా ప్రస్తుత ఏర్పాట్లతోనే కాలం వెళ్లదీస్తారని ఒక అంచనా వుంది.

అయితే ఏ కారణం చేతనైనా నాయకత్వ మార్పిడి జరిగిపోతే తాము వెనుక పడకూడదనే ఉద్దేశంతో ఒక మోస్తరు నేతలంతా ముఖ్యమంత్రి పీఠం మీద ఆశలు పెంచుకొంటున్నారు. ఈ పరుగు పందెంలో పాల్గొనడానికి వురవుర లాడుతున్న వారి జాబితా చూస్తే ఆశ్చర్యం కల్గుతున్నది. స్పీకర్ కిరణ్ కుమార్‌రెడ్డి, మంత్రులు బొత్సా సత్యనారాయణ, రఘువీరారెడ్డి, ఆనం రామనారాయణరెడ్డి, గీతారెడ్డి, మాజీ మంత్రులు జానారెడ్డి, జెసి.దివాకర్ రెడ్డి, డిఎల్.రవీంద్రరెడ్డి, కేంద్రమంత్రులు దగ్గుపాటి పురంధరేశ్వరి, జైపాల్‌రెడ్డి... ఇట్లా చెప్పుకొంటూ పోతే కొండవీటి చాంతాడంత జాబితా తయారౌతున్నది.

కొరవ 14వ పేజీలో

## "రెడ్లకే పాలించే అర్హత"

రాష్ట్రంలో నూతన నాయకత్వ నిర్ణయానికి ఒక కొత్త సిద్ధాంతం ప్రతిపాదించాడు కేంద్రమంత్రి జైపాల్‌రెడ్డి. బ్రిటీష్ దొరలు ఒక మాన్యువల్‌లో "ఆంధ్ర ప్రాంతంలో సమర్ధవంతమైన పాలన నెలకొల్పాలంటే బ్రిటీష్ ప్రతినిధులు వుండాలని, అది వీలు కాని పక్షంలో రెడ్డి కులస్తులకు మాత్రమే ఆ అర్హత వుందని, మరొక కులం వారికి ఆంధ్ర పెత్తనం అప్పచెప్తే పాలన సజావుగా నడవదని" వ్రాశారట. ఆ మాన్యువల్ ఆయనకు ఎక్కడ దొరికిందో మనకైతే తెలియదు కానీ, రోశయ్య స్థానంలో కొత్త ముఖ్యమంత్రి ఎంపికకు ఈ బ్రిటీష్ సిద్ధాంతాన్ని తెర మీదకు తెచ్చాడాయన. ముఖ్యమంత్రి పదవి మీద ఆశతో తనను కలవడానికి వచ్చిన ఒక కాపు కుల మంత్రితో ఈ మాట చెప్పి, మీ కులాల వారు ఆశలు వదిలేసుకోండి అని సలహా కూడా ఇచ్చాడట.

అయితే బ్రిటీష్ దొరలు తమ పాలన హయాంలో ఆంధ్ర ప్రాంతం మొత్తం మీద ఒక్క రెడ్డికి పగ్గాలు అప్ప చెప్పిన దాఖలా చరిత్రలో లేనప్పుడు జైపాల్‌రెడ్డి ఈ సూత్రాన్ని అధిష్టానానికి వినిపించడమేమిటని తతిమా కులాల వారు గోడుగోడు మంటున్నారు. బొబ్బిలి, విజయనగరం నుంచి వెంకటగిరి, శ్రీకాళహస్తి వరకు, చివరకు కర్నాటక సరిహద్దులోని కుప్పంలో కూడా ఆంధ్ర ప్రాంతంలోని ఏ జమీం

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్

రాష్ట్ర మంతటా విస్తారంగా వర్షాలు

నందు

ఇదిగో గణేశా! వరదల్లో మునగకుండా దీన్ని తీసుకెళ్లు నాయనా!

## ● జగన్ ఓదార్పు యాత్రతో

# జిల్లాలో నిట్టనిలువుగా చీలనున్న కాంగ్రెస్!

నెల్లూరు జిల్లాలో వైఎస్.జగన్ ఓదార్పు యాత్రకు సన్నాహాలు జోరుగా సాగుతున్నాయి. ఆయన జిల్లాలోకి ఎప్పుడు ప్రవేశిస్తాడో ఖచ్చితంగా తెలియదు. ప్రకాశంజిల్లా యాత్ర జీడిపాకం వలె సాగుతున్నది. అది మరొక పది పన్నెండు రోజులు నడుస్తుందని అంచనా. ఆ తర్వాతే నెల్లూరు. తేది తెలియకపోయినా వచ్చేది ఖాయం కాబట్టి, ఏర్పాట్లు చకా చకా జరిగిపోతున్నాయి. ఈ యాత్రతో జిల్లా కాంగ్రెస్ పార్టీ నిట్టనిలువుగా చీలిపోతున్నది. ఎవరికివారు ముసుగులు తొలగించుకోక తప్పని సమయం వచ్చేసింది.

మొదటి నుంచి జగన్ పక్షంగా బల్లగుద్ది వాదిస్తున్న నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్ రెడ్డి, ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్ రెడ్డి యాత్రకు నేతృత్వం వహిస్తున్నారు. కాంగ్రెస్ అధిష్టానం అంత స్పష్టంగా చెప్పినా, యాత్ర బాధ్యత తీసుకొన్నారంటే, పార్టీతో తెగతెంపులకు సిద్ధమైనట్లే లెక్క. వారిని అంత తెగింపు నిర్ణయానికి ప్రేరేపించిన అంశం ఏమిటన్నది ఇప్పటికీ ఒక మిస్టరీగానే వుంది. ఏదైనా విచిత్రం జరిగితే తప్ప, యాత్రలో పాలు పంచుకొన్న ఎమ్మెల్యేలు, ఎమ్పీలను కాంగ్రెస్ నుంచి వెలి వేయడం ఖాయం. అది ఏ రోజైనా జరిగి పోవచ్చు.

ద్వితీయ శ్రేణిలో రాజీవ్‌భవన్ నిర్వాహకులు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, నెల్లూరు నగర నియోజకవర్గం కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసి ఓడిపోయిన అనిల్‌కుమార్ యాదవ్ యాత్ర పెత్తనం తీసుకొన్నారు. దీనివల్ల వారికి పోయేదేమీ లేదు. నెల్లూరు నగరానికి సంబంధించినంత వరకు ఆనం వారిని కాదని కాంగ్రెస్ పార్టీలో వారికి జరిగే ఉపకారం ఏదీ లేదు. అదృష్టం బాగుండి జగన్ పెట్టబోయే స్వంత పార్టీ ఒక రాజకీయ శక్తిగా ఎదిగితే, ఈ ప్రాంతానికి వారే రాజులౌ

కొరవ 14వ పేజీలో

# ఎందుకీ దర్యాప్తు?

ఎపిఐఐసీ భూముల పందారంలో జరిగిన విచ్చలవిడి అవినీతి మీద దర్యాప్తు జరపమని ఎసిబి ప్రత్యేక న్యాయ స్థానం అవినీతి నిరోధక శాఖను ఆదేశించింది. ఎమ్మార్ ప్రాపర్టీస్ అనే దుబాయి సంస్థకు చంద్రబాబు నాయుడు హయాంలో హైదరాబాద్ శివార్లలో విశాలమైన భూమి కేటాయించారు. ఆనాటికి అది తొండలు గుడ్లు పెట్టే బీడు భూమి. హైదరాబాద్ నగరానికి విదేశీ పారిశ్రామిక పెట్టుబడులను ఆకర్షించడానికి, వారికవసరమైన ప్రాథమిక వసతులు కల్పించే ఉద్దేశంతో ఈ కేటాయింపు జరిపారు. హైటెక్ సిటీలో ఆధునిక సమావేశ మందిరం, అందులోనే ఒక ఫైవ్‌స్టార్ హోటల్, ఇక్కడ పని చేయడానికి వచ్చే విదేశీయుల జీవనశైలికి అనుగుణంగా నివాస భవనాలు, గోల్ఫ్ కోర్స్, క్లబ్ వంటివి నిర్మించే బాధ్యత ఎమ్మార్ ప్రాపర్టీస్‌కు అప్పచెప్పారు. అయితే అప్పట్లో ఇటువంటి నిర్మాణాలకు హైదరాబాద్ నగరంలో విలువ లేదు. వాటిని ఉపయోగించేవారూ లేరు. అందువల్ల, ఆ కంపెనీకి భూమిని ఉచితంగా ఇచ్చి, పెట్టుబడి పెట్టడానికి ప్రోత్సాహం కల్పించారు. భూమి విలువకు మారుగా, అంతమేర ఎపిఐఐసికి ఆ నిర్మాణాలలో 26శాతం వాటా వుండేట్లు ఒప్పందం చేశారు.

వైఎస్.రాజశేఖర్‌రెడ్డి అధికారంలోకి రాగానే పరిస్థితి మారిపోయింది. అనుకొన్న దానికంటే వేగంగా హైదరాబాదులో సాఫ్ట్‌వేర్ పరిశ్రమ వృద్ధి చెందడం వల్ల శివారు ప్రాంతం కాస్తా, నగరంలో కలిసిపోయింది. ఆ భూములకు కోట్ల విలువ వచ్చింది. అన్ని వ్యాపార ఒప్పందాల వలెనే, దీనిలోనూ స్వంత లాభం చూసుకొన్నారు. ఎపిఐఐసీ వాటాను కరిగించివేసి, వేల కోట్ల రూపాయల విలువ చేసే ఆస్తిపాస్తులన్నీ ఎమ్మార్ ప్రాపర్టీస్ స్వంతం చేసుకొనేందుకు సహకరించాడు. ఎపిఐఐసి మేనేజింగ్ డైరక్టర్‌గా వుండిన సీనియర్ ఐఎఎస్ అధికారి బిపి.ఆచార్య ముఖ్యమంత్రి అభీష్టానుసారం ప్రభుత్వాన్ని దివాలా తీయించి, ఎమ్మార్ ప్రాపర్టీస్ గుమస్తా వలె పని చేశాడు.

కాంగ్రెస్ నేత డిఎల్.రవీంద్రరెడ్డి ఈ నిట్టనిలువు దోపిడీపై గళం విప్పడంతో రాష్ట్రం మొత్తం ఒక్కసారిగా ఉలిక్కి పడింది. ఇన్ని వేల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని ఒక ప్రైవేట్ కంపెనీ కొల్లగొట్టుకొని పోవడం పట్ల అన్ని వర్గాల ప్రజలు తీవ్ర నిరసన వ్యక్తం చేశారు. కానీ రాష్ట్ర ప్రభుత్వంలో ఇప్పటికీ వైఎస్ కుటుంబ పలుకుబడి బలంగా వుండడం వల్ల ప్రస్తుత ముఖ్యమంత్రి రోశయ్య ఏమీ చేయలేక పోయాడు. దీనిపై దర్యాప్తు జరపాలని ఆయన చేసిన ప్రతిపాదనను క్యాబినెట్‌లోని వైఎస్ అనుకూల మంత్రులందరూ గట్టిగా ప్రతిఘటించారు. కనీసం దీనికంతటికీ కారకుడైన ఐఎఎస్ అధికారి ఆచార్యను బదలీ చేయడానికి కూడా రోశయ్యకు శక్తి చాలలేదు.

ఈ నేపథ్యంలో ఒక న్యాయవాది నేరుగా ఎసిబి ప్రత్యేక కోర్టును ఆశ్రయించడంతో, న్యాయమూర్తి ఎసిబి దర్యాప్తుకు ఆదేశించాడు. అయితే ఇప్పుడైనా నేరాన్ని వెలికి తీస్తారని, దోషులను శిక్షిస్తారని నమ్మడానికి లేదు. ఐఎఎస్ అధికారుల మీద ఎసిబి దర్యాప్తుకు ప్రభుత్వం ఎప్పుడూ అనుమతించలేదు. ఒక ఐఎఎస్ అవినీతిని ప్రశ్నించడానికి ప్రభుత్వం ప్రయత్నించినప్పుడల్లా మొత్తం ఐఎఎస్ అధికారులందరూ ఏకమై ప్రతిఘటించడం సాంప్రదాయమై పోయింది. ఐఎఎస్‌లు చట్టాలకు అతీతులన్న ధోరణిలో నడుస్తున్నది మన అధికార యంత్రాంగం.

జమీన్‌రైతు

ఎపిఐఐసిలో ఎమ్మార్ ప్రాపర్టీస్ దోపిడీ చాలా చిన్న భాగం మాత్రమే. వైఎస్ ముఖ్యమంత్రిగా వున్న ఐదేళ్ల కాలంలో దాదాపు రెండు లక్షల ఎకరాల ప్రభుత్వ, ప్రైవేట్ భూమిని పారిశ్రామికులకు కట్టబెట్టి, లక్షల కోట్ల రూపాయల దోపిడీ చేయడానికి వేదికగా ఉపయోగపడిన ప్రభుత్వ సంస్థ ఎపిఐఐసి. ఆ అవినీతి కథలన్నిటినీ వెలికి తీస్తే ప్రపంచ చరిత్రలోనే మున్నెన్నడూ చూడని పరిమాణంలో ప్రజాధనం స్వాహా వెలికి వస్తుంది. కానీ ముఖ్యమంత్రులు, మంత్రులు, అధికారులు, పారిశ్రామికవేత్తలు కుమ్మక్కై జరిపే దోపిడీ ఎప్పటికీ వెలికి వచ్చే అవకాశం లేదు. కోర్టు ఆదేశాలు, ఎసిబి దర్యాప్తులు ప్రజల కన్నీళ్లు తుడవడానికి తప్ప మరిదేనికీ పనికిరావు. ఏ సైనిక నియంతో దేశ పాలకుడిగా వచ్చి, తుపాకి గొట్టం కణతకు పెట్టి నిజాలను కక్కించే రోజు వస్తే తప్ప దొంగలందరూ దొరలుగా జనంలో చలామణి కావడం ఖాయం.

## జనవాణి

### విద్యార్థుల ఆత్మహత్యలు నిరోధించండి!

ఇటీవల ఇంటర్ విద్యార్థులు తరచుగా ఆత్మహత్యలు చేసుకోవడం చూస్తున్నాం. ఇవి ఎక్కువగా కార్పొరేట్ కళాశాలల్లోనే జరగడం విచారకరం. తల్లితండ్రులు తమ బిడ్డల శక్తి సామర్థ్యాలను గుర్తించక, పిల్లల అభీష్టాలను మన్నించక, తమ ఇష్టానుసారం వారిని ఇంజనీర్లు, డాక్టర్లు చేయాలనే కోరికతో వ్యవహరించి ఈ కళాశాలల్లో చేర్పిస్తున్నారు. కళాశాలల యాజమాన్యాలు ఉదయం 7 గంటల నుంచి రాత్రి ఏడు గంటల వరకు విద్యాబోధన, డిసెంబర్‌కే సిలబస్ పూర్తి చేయాలనే తొందరపాటు విద్యార్థుల మానసిక స్థితిపై ప్రభావం చూపుతున్నాయి. విశ్రాంతిలేని విద్యాబోధనకు విద్యార్థులు బలైపోతున్నారు. నవంబర్‌కే సిలబస్ పూర్తి చేయాలని ఇంటర్ బోర్డు కొత్తగా జారీ చేసిన అనాలోచిత ఉత్తర్వుతో బోధనను వేగవంతం చేస్తున్నారు. దీనివల్ల సగటు ప్రజ్ఞావంతులు, అల్ప ప్రజ్ఞావంతులైన విద్యార్థులు పాఠ్యాంశాలు అర్థంగాక, బోధనా కాలానికి సర్దుబాటు చేసుకోలేక, డైలీ పరీక్షల్లో మార్కులు రాక ఆత్మనూన్యతా భావానికి గురై ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. ఈ విధానం మార్చును మేధావులు, ప్రభుత్వం ఓ కార్యాచరణ రూపొందించమనవి.

ఎం.శ్రీనివాసరావు, నెల్లూరు

### పోలీసుల ప్రేక్షకపాత్ర

నెల్లూరు నగరంలో ఈ మధ్య దొంగతనాలు పెచ్చు పెరిగిపోయాయి. ఇంటికి తాళమేసి కనపడితే చాలు వెంటనే దొంగతనం చేస్తున్నారు. గడచిన పక్షం రోజులుగా నగరంలో 15 చోట్లకుపైగా దొంగతనాలు జరిగాయి. క్రైం పోలీసులు, క్లూస్‌టీం వెళ్లి ఏదో హంగామా చేసి వస్తున్నారు. కాని దొంగలను పట్టుకోవడంలో పూర్తిగా విఫలమయ్యారు. విపరీతంగా దొంగతనాలు జరుగుతున్నా నగరంలో రాత్రిపూట గస్తీని మెరుగుపర్చిన పాపాన పోలేదు.

ఎం.సుధామయి, నెల్లూరు

### మరపురాని వైఎస్!

మాజీ ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి చనిపోయి అప్పుడే ఏడాదయ్యిందంటే నమ్మలేకున్నాం. రాష్ట్రాన్ని పరిపాలించిన ఏ ముఖ్యమంత్రి కూడా వైఎస్‌లా సామాన్య జనం గుండెల్లో గూడుకట్టుకోలేదు. ఆయన ప్రారంభించిన కొన్ని పథకాలను విమర్శించినా రైతులకు ఉచిత విద్యుత్, ఆరోగ్యశ్రీ, వృద్ధులకు పింఛన్లు, విద్యార్థులకు ఫీజు రీయింబర్స్‌మెంట్ పథకాలను ఎవరూ వేలెత్తి

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

13-9-1940
పేజీలు : 16 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

#### జిల్లా కాంగ్రెస్ సంఘము

ఈ జిల్లా సంఘం నిద్రబోతున్నది. పనిచేయక పోయినా వున్న గడ్డివామి అంతా తినివేసింది. అధ్యక్షుడు – అరేబియా ఎడారిలో గాఢ నిద్రలో వున్నట్లు రేడియో వార్త. పొలిటికల్ కాన్ఫరెన్స్ ఎప్పుడు? ఈ ప్రశ్నకు ఎవరు సమాధానం చెప్పేది?

#### పిచ్చు బొచ్చెలు

వ్యవసాయ కూలీల సమ్మెల సందర్భంలో ఇక క్రమమైన పాత్రలతో కూలీ కొలుస్తామని రైతులు వ్రాసి ఇచ్చిన అగ్రిమెంట్‌ను ధిక్కరించి రైతులు తిరుగా పిచ్చు బొచ్చెలతో కూలీలు కొలుస్తున్నారు. ఈ విషయమై ప్రతి డిప్టీ కలెక్టరు వారును తగు శ్రద్ధ వహించి కలెక్టర్ వారికి రిపోర్టు చేయవలెను.

–బొమ్మా శేషురెడ్డి.

#### వెంకటగిరి గొడవలు

కో – ఆపరేటివ్ బ్యాంకు పెట్టి అప్పులు యిప్పిస్తామని దర్శి డివిజన్లో ప్రచారం సాగుతున్నది. వెంపరాల కరణం ఒక ప్రచారకుణ్ణి వెంటబెట్టుకొచ్చి ఉప్పలపాటి కూలీలంతా మెంబర్లుగా చేరమని ప్రబోధించగా మాకు కో – ఆపరేటివ్ సొసైటీ వుంది, మీ అప్పులు మాకవసరం లేదని చెప్పారట.

ఇంతా శిస్తు బకాయిలు మరో చట్టం వచ్చి మింగేస్తుందేమో ఏదో ఒక బ్యాంకు మార్టిగేజీ బ్యాంకు పెట్టించి తద్వారా బకాయిలు పూడగొడతామనే ఆలోచనేగానీ, రైతులకు అప్పులు ఇప్పించి రుణ సముద్రంలో నుండి బయట వేస్తామని కాదు. "పులి దాసళ్లకు పెడుతుందా?

## 50 ఏళ్ల క్రితం ఈవారం

9-9-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఫిరోజ్ గాంధీ మృతి

కాంగ్రెస్ మాజీ అధ్యక్షురాలు శ్రీమతి ఇందిర భర్త, ప్రధాని నెహ్రూ అల్లుడు, దేశంలోని అవినీతి వర్గాలకు సింహస్వప్నమైన పార్లమెంటు సభ్యుడు ఫిరోజ్ గాంధీ హృద్రోగంతో 8వ తేది ఉదయం 7.45 గంటలకు, ఢిల్లీలో అకాల హఠాన్మరణం పాలయ్యారు.

వీరి వయస్సు 48 సంవత్సరాలు. వీరు పార్సీ జాతివారైనా, హిందూ సాంప్రదాయం ప్రకారం 8వ తేది సాయంకాలం అంత్యక్రియలు జరిగినవి.

వీరికి శ్రీమతి ఇందిరతో 1942లో వివాహం జరిగింది. రాజీవ్(15), సంజయ్(12)లు వీరి యిరువురు కుమారులు. భర్తను కోల్పోయిన ఇందిరమ్మకు మా సానుభూతి.

### పవర్స్ వేతనం 12వేలు

అమెరికా యు–2 గూఢచారి విమానంలో 68వేల అడుగుల ఎత్తున రష్యామీద ఎగురుతుండగా పడగొట్టబడి, పదేళ్ల శిక్ష విధించబడిన ఫ్రాన్సిస్ గేరి పవర్సు నెలసరి వేతనం 2,500 డాలర్లట.

అంటే షుమారు 12వేల రూపాయలన్న మాట. మనదేశంలో రాష్ట్రపతికి గూడా యింత పెద్ద జీతం లేదు.

### లుమాంబా ఒకప్పుడు పోస్టల్ గుమస్తా

కాంగో ప్రధాని, నేడు ప్రపంచ వార్తలలో అత్యంత ప్రాధాన్యం వహిస్తున్న పాట్రిస్ లుమాంబా ఒకప్పుడు పోస్టల్ శాఖలో చిన్న గుమాస్తా అట. ఈయన చదువు గూడా చిన్నదే.

# నెల్లూరు ముచ్చట్లు

## తగ్గిన బియ్యం ధరలు

నెల్లూరు మార్కెట్‌లో అనూహ్యంగా బియ్యం ధరలు తగ్గాయి. గత వారం వరకు 850 రూపాయలుగా అమ్ముతుండిన జిలకరమసూరి రకం 25 కిలోల బియ్యం బస్తా బాగా తగ్గి 680 రూపాయలయ్యింది. కిలో 34 రూపాయలమ్ముతుండిన జిలకర మసూరి బియ్యం 29 రూపాయల నుంచి రకాన్ని బట్టి 25 రూపాయలకు తగ్గాయి. ఇవన్నీ పాత బియ్యం కావడం విశేషం.

మార్కెట్‌లో డిమాండ్ – సప్లైతో సంబంధం లేకుండా పెరిగి వుండిన బియ్యం ధరలు ఎందుకు తగ్గాయో అర్థం కావడం లేదు.

## జగన్‌పై చర్యతో కాంగ్రెస్ భూస్థాపితం!

జగన్ నెల్లూరు జిల్లా పర్యటన ఏర్పాట్లపై 7వ తేది నిర్వహించిన సమీక్షా సమావేశంలో నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి చేసిన వ్యాఖ్యలు సంచలనం సృష్టించాయి. ఆయన మాట్లాడుతూ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ద్వారా లబ్ధి పొందిన కొందరు నాయకులు నేడు జగన్ యాత్రకు దూరంగా వుంటున్నారని రేపు జగన్ ముఖ్యమంత్రి అయితే ఇప్పుడు దూరంగా వున్న వారంతా అప్పుడు క్యూ కడతారని ఆనం వారిని ఉద్దేశించి పరోక్ష వ్యాఖ్యలు చేశారు. జగన్‌ను ఇప్పటికిప్పుడు ముఖ్యమంత్రిని చేయమని కోరడంలేదని, 2014 ఎన్నికలకు పార్టీ ఆయన నేతృత్వంలో ప్రజల్లోకి వెళ్తే మంచి ఫలితాలు వుంటాయన్నారు. ఒకవేళ జగన్‌పై కాంగ్రెస్ పార్టీ అధిష్ఠానం చర్యలకు సిద్ధపడితే ఆ రోజు నుంచే రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ భూస్థాపితం అవుతుందన్నారు. ఏదిఏమైనా జగన్ సిఎం కావడం తథ్యమని తేల్చి చెప్పారు మేకపాటి.



## బాలాకుమారులెవరు?

ఈ మధ్య నెల్లూరుకు చెందిన రాజకీయ నాయకులు జగన్‌కు మద్దతుగా వివిధ వేదికలపై మాట్లాడుతూ వయసు మళ్లిన నాయకులు అధిష్ఠానానికి చేస్తున్న ఫిర్యాదుల వల్ల ఆయనకు ఇబ్బందులు ఎదురవుతున్నట్లు చెబుతున్నారు. వాస్తవానికి జిల్లాలో జగన్‌కు గట్టి మద్దతుదారులైన నెల్లూరు ఎమ్పీ రాజమోహన్‌రెడ్డి వయస్సు అరవై ఏళ్లు దాటింది. ఓదార్పు యాత్రలో పాల్గొంటామని ముందుకొచ్చిన దేగా నారసింహారెడ్డి, బెజవాడ గోవిందరెడ్డి, టి.వి.ఎస్. రాజా వయస్సులో పెద్దవారే. విష్ణు, నెలవల సుబ్రహ్మణ్యం 50 ఏళ్లు పైబడినవారే. జగన్ వైపు వున్న బాలాకుమారుడిగా రాజీవ్‌గాంధీ భవన్ నిర్వాహకుడు అనిల్‌కుమార్‌నే చెప్పుకోవాల్సి వస్తుంది.

## రహస్య యాగంతో ప్రారంభోత్సవం!

చిన్న విషయానికి కూడా పెద్ద ప్రచారం చేసుకొనే రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి పది కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి నిర్మించిన నెల్లూరు కార్పొరేషన్ భవనాన్ని 5వ తేది రహస్యంగా ప్రారంభించారు. ఆదివారం రోజు వివేకానందరెడ్డి తన జంట ఎమ్మెల్యే శ్రీధర్ కృష్ణారెడ్డి, మేయర్ భానుశ్రీ, కమిషనర్ ఆంజనేయులుతో కలిసి కొత్త కార్యాలయంలో మహాయాగం చేశారు. ఇది పూర్తయ్యాక ప్రారంభోత్సవమయినట్లు ప్రకటించారు. ఆ రోజే చిమ్మచీకటిలో నెల్లూరు సమ్మర్ స్టోరేజ్ ట్యాంకు వద్దకు కూడా వెళ్లి అక్కడా ప్రత్యేక పూజలు చేసి 'మమ' అనిపించారు.

కార్పొరేషన్ పాలకవర్గ పదవీ కాలం పూర్తవుతుండడం, వీటిని ప్రారంభించను ముఖ్యమంత్రి వచ్చే అవకాశం లేకపోవడంతో వివేకానందరెడ్డినే తన చేతుల మీదుగా ఈ రహస్య ప్రారంభోత్సవాలు చేశారు.



## నెల్లూరులో ఏసి మసీదులు

రంజాన్ పండుగను పురస్కరించుకొని నెల్లూరులోని రెండు మసీదులకు ఎయిర్ కండిషన్ సౌలభ్యం సమకూరింది. జెండావీధిలోని పురాతన మసీదు హాల్ తాలిమ్‌తోపాటు గిడ్డంగి వీధిలోని మసీదుకు దాతృత్వపరులు ఈ సౌకర్యాలు కల్పించారు.

ఏసి మసీదుల్లో 6వ తేది రంజాన్ నెలలో అతి ముఖ్యమైన రాత్రి లైలతుల్ ఖదర్(జాగరణ) ప్రార్థనలకు వందల సంఖ్యలో భక్తులు రావడంతో అవి కిటకిటలాడాయి.

## విక్రమ సింహపురి రిజిస్ట్రార్‌కు అవార్డు

నెల్లూరు విక్రమ సింహపురి యూనివర్శిటీ రిజిస్ట్రార్ నారాయణ రెడ్డిని ఉపాధ్యాయ దినోత్సవం సందర్భంగా హైదరాబాద్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో రాష్ట్ర ఉన్నత విద్యాశాఖ మంత్రి డి.శ్రీధర్‌బాబు ఉత్తమ ఉపాధ్యాయ అవార్డుతో సత్కరించారు. వేణుగోపాలస్వామి కాలేజిలో మ్యాథ్స్ రీడర్ పి.ఎం.వి.ప్రసాద్, విద్యానగర్ ఎన్‌బికెఆర్ కాలేజి ఫిజిక్స్ లెక్చరర్ వుక్కా రాజాలకు మంత్రి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డులు బహూకరించారు.

## నెల్లూరు భాజపా ఇన్‌ఛార్జ్!

నెల్లూరులో నీరసపడ్డ భారతీయ జనతా పార్టీలో జవసత్వాలు నింపి నడపను జిల్లా ఇన్‌ఛార్జ్‌గా చిత్తూరు జిల్లా బిజెపి నాయకుడు భానుప్రకాష్‌రెడ్డిని పార్టీ రాష్ట్ర అధ్యక్షుడు కిషన్‌రెడ్డి నియమించారు. భానుప్రకాష్‌రెడ్డికి ఆ పార్టీలో మంచి ఉత్సాహపరుడైన నేతగా పేరుంది. మహామహులు వున్న నెల్లూరు బిజెపిని భానుప్రకాష్ ఏవిధంగా ముందుకు నడుపుతారన్నది వేచి చూడాల్సిందే.

## చవితి ఉత్సవాలకు డిఎస్పీ షరతులు!

నెల్లూరు నగరంలో వినాయక చవితి ఉత్సవాలు ప్రశాంతంగా జరపను నగర డిఎస్పీ జి.రాధిక విక్రమ సింహపురి గణేష్ ఉత్సవ కమిటీకి పలు సూచనలు సలహాలిచ్చారు. 6వ తేది తన కార్యాలయంలో సమితి సభ్యులతో సమావేశమైన డిఎస్పీ పొగతోట, బృందావనం ప్రాంతాల్లో హాస్పిటళ్లు వున్నందున ఇక్కడ ఏర్పాటుచేసే వినాయక విగ్రహాల వద్ద మైకుసెట్లు పెట్టొద్దన్నారు. రాత్రి పది గంటల తర్వాత మైకు సెట్లు వాడొద్దని, సాంస్కృతిక కార్యక్రమాలంటూ అశ్లీల నృత్యాలు ఏర్పాటు చేయవద్దన్నారు. ట్రాఫిక్‌కు ఇబ్బంది కలిగించేలా వినాయక విగ్రహాలు ఏర్పాటు చేయవద్దని కమిటీ సభ్యులను కోరారు.



కృష్ణాష్టమిని పురస్కరించుకొని నెల్లూరులోని ఇస్కాన్ సిటీలోని శ్రీకృష్ణ మందిరం అభివృద్ధికి ప్రముఖ పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి మూడు లక్షల రూపాయల విరాళమందించారు. ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ రాంగోపాల్, జడ్పీసిఇఓ రామిరెడ్డి పాల్గొన్నారు.

## డాక్టర్ నిర్మలకు పెద్ద బాధ్యత

నెల్లూరు జూబ్లీ హాస్పిటల్ సీనియర్ వైద్యాధికారిణిగా పనిచేస్తుండిన డాక్టర్ నిర్మలకు ప్రమోషన్ లభించింది. ఆమెను జిల్లాలోని ప్రభుత్వ ఆసుపత్రుల సమన్వయకర్తగా నియమించారు. గతంలో ఈ బాధ్యతలు నిర్వహిస్తుండిన డాక్టర్ చెన్నయ్యను ఆదిలాబాద్‌కు బదలీ చేశారు.

డాక్టర్ నిర్మల నెల్లూరు పెద్దాసుపత్రి సూపరింటెండెంట్ డాక్టర్ పెంచలయ్య సతీమణి. డాక్టర్ నిర్మల చేయి తిరిగిన గైనకాలజిస్ట్‌గా పేరు తెచ్చుకొన్నారు. ప్రభుత్వ ఆస్పత్రుల సమన్వయకర్తగా కూడా ఆమె పేరు తెచ్చుకోవాలని కోరుకొంటున్నాం.

## క్యాన్సర్ హాస్పిటల్‌కు విరాళం

నెల్లూరు పొదలకూరురోడ్డు ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ నేతృత్వంలో నడుస్తున్న క్యాన్సర్ ఆసుపత్రి అభివృద్ధికి యల్లాయపాళెం గ్రామ ప్రముఖుడు సిపిరామిరెడ్డి, ఆయన సతీమణి బుజ్జమ్మ లక్ష రూపాయలు విరాళం ఇచ్చారు. ఈ మొత్తాన్ని 3వ తేది జిల్లా కలెక్టర్ రాంగోపాల్‌ను కలసి అందించారు. ఈ కార్యక్రమంలో రెడ్‌క్రాస్ కార్యదర్శి డాక్టర్ ఎ.వి.సుబ్రహ్మణ్యం కూడా పాల్గొన్నారు.

## బుర్లా నాగార్జునరెడ్డి తృతీయ వర్ధంతి

వాకాడుకు సమీపంలో మావోయిస్టులు పేల్చిన మందుపాతరలో అశువులు బాసిన కాంగ్రెస్ కార్యకర్త బుర్లా నాగార్జునరెడ్డి తృతీయ వర్ధంతి 7వ తేది ఇందిరా భవన్‌లో జరిగింది. కాంగ్రెస్ ఎస్సీ సెల్ ఛైర్మన్ టి.బాలసుధాకర్, జిల్లా యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడు పేర్నేటి కోటీశ్వరరెడ్డి, మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ నాగార్జునరెడ్డి గుణగణాలను ప్రస్తుతిస్తూ మాట్లాడారు. అనంతరం పేదలకు దుప్పట్లు పంపిణీ చేశారు.

సీమా సెంటర్‌లో నాగార్జునరెడ్డి వర్ధంతిని పురస్కరించుకొని ఆయన మిత్రులు, బంధువులు అన్నదానం చేశారు.

## శస్త్రచికిత్సలకు వికలాంగులు

గత నెల జిల్లా పరిషత్ నేతృత్వంలో నిర్వహించిన వికలాంగుల మెగా ఉచిత వైద్య శిబిరంలో ఎంపిక చేసిన ఒక బ్యాచ్‌ను శస్త్రచికిత్సలకు 6వ తేది తిరుపతిలోని బర్డ్‌కు పంపారు. రెండు ప్రత్యేక వాహనాల్లో వీరిని పంపిన జడ్పీ ఛైర్మన్ వికలాంగుల మంచి చెడ్డలు చూడను కొందరు జడ్పీ ఉద్యోగులకు డ్యూటీ కూడా వేశారు.

## ప్రజారాజ్యం కండువా వేసిన వివేకా!

చిత్ర విచిత్ర వేషాలతో నెల్లూరు జనాలను ఆకట్టుకొంటుండే రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మరో విచిత్రమైన పనిచేశారు. 6వ తేది నెల్లూరు

కొరవ 14వ పేజీలో

# ఆయలూరివారి సత్రంలో అక్రమ తిష్ట!



షాపింగ్ కాంప్లెక్స్‌గా మారిన ఆయలూరి వెంకయ్య పంతులు సత్రం. (ఇన్‌సెట్‌లో దేవాదాయశాఖ కార్యాలయాలు నడుస్తున్న చిత్రం).

నెల్లూరులో వివిధ హిందూ దేవాలయాలు, ధర్మసత్రాలు ఆస్తులను అక్రమార్కులు ఆక్రమించారు. వాస్తవానికి ఈ ఆస్తులను సంరక్షించాల్సిన బాధ్యత దేవాదాయ ధర్మాదాయ శాఖాధికారులది. కానీ కంచే చేను మేసిన చందంగా దేవాదాయ శాఖాధికారులే ఓ దాత బ్రాహ్మణుల సంక్షేమార్థం ఇచ్చిన సత్రాన్ని ఆక్రమించి తమ కార్యాలయాలు జల్సాగా నడుపుకొంటున్నారు. నగరంలోని రేబాలవారి వీధిలో ప్రస్తుతమైతే కోట్ల రూపాయల విలువచేసే సత్రాన్ని 1895లో ఆనాటి ప్రముఖ వకీలు ఆయలూరు వెంకయ్య పంతులు బ్రాహ్మణ సమాజానికి దానంగా ఇచ్చారు. ఇక్కడుండి బ్రాహ్మణుల పిల్లలు చదువుకొనేందుకు వారి భోజన వసతికి, ఇతర కార్యక్రమాలు జరుపుకొనేందుకు రెండు వేల అంకణాల ఈ సత్రాన్ని కానుకగా ఇచ్చారు. దీనికితోడు ఆ రోజుల్లోనే 11వేల రూపాయల ఆర్థిక సహాయం, వరిగొండ గ్రామంలో 2.87 ఎకరాల మాగాణి, ఒజ్జావారిపాళెంలో 17.90 ఎకరాల మాగాణి సత్రం నిర్వహణకు దానంగా ఇచ్చారు. పంతులుగారు ఇచ్చిన స్థిరచరాస్తులను స్వాధీనం చేసుకొన్న దేవాదాయ శాఖ దాత ట్రస్ట్ డీడ్‌కు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నది. ఇక్కడ తమ శాఖకు సంబంధించిన ప్రధాన కార్యాలయాలు ఏర్పాటు చేసుకొన్నారు. దీనివల్ల దాత ఆశయం, త్యాగనిరతి గంగలో కొట్టుకపోయింది. బ్రాహ్మణ సంఘాలు, నాయకులకు నోరు తక్కువవడం, రాజకీయ నాయకులు సహకరించక పోవడంతో ఆయలూరి వారి సత్రంలో దేవాదాయ శాఖ అక్రమ తిష్ట కొనసాగి పోతుంది. జిల్లా కలెక్టర్ జోక్యం చేసుకొని ఆయలూరి వారి సత్రాన్ని దేవాదాయ శాఖ కబంధహస్తాల నుంచి విముక్తిచేసి బ్రాహ్మణుల సంక్షేమార్థం వినియోగించేలా చర్యలు తీసుకోవాల్సి వుంది.

# టైలర్లకు భలే గిరాకీ

శ్రావణ మాసంలో వరుస పెళ్లిళ్లు, రంజాన్, వినాయకచవితి పండుగలు రావడంతో టైలర్లు బిజీ అయిపోయారు. వర్కర్ల కొరత అంటూ గతంలో మధ్యతరగతి టైలర్ ఒక ఫ్యాంట్, షర్ట్ కుడితే తీసుకొనే కూలీ 250 రూపాయల నుంచి ఏకంగా 400 రూపాయలు చేసేశారు. పెద్ద టైలర్లు ఓ జత కుట్టిన దానికి 500 రూపాయల నుంచి 600 రూపాయలు వసూలు చేస్తున్నారు. బ్రాండెడ్ టైలర్లు కేవలం బట్టలు

**ప్యాంట్, షర్ట్‌కు కూలీ రూ.600లే!**

కొలతలు ప్రకారం కట్‌చేసి ఇస్తారు. టైలర్ల దగ్గర వుండే వర్కర్లు వీటిని కుడతారు. దీనికిగాను ఒక జతకు వీరికి వంద రూపాయలు ఇస్తారు. ఒక జత కుట్టను మెటీరియల్ ఖర్చులు 25 రూపాయలలోపే అవుతాయి. కానీ టైలర్లు జతకు 400 నుంచి 600 రూపాయల తీసుకోవడం సామాన్య, మధ్యతరగతీయులకు కష్టంగా మారింది. కొన్నిసార్లు ప్యాంట్, షర్ట్ బిట్స్ కలిపి 500 రూపాయలకే మంచివి వస్తున్నా ఇంతకన్నా ఎక్కువ స్టిచ్చింగ్‌కు ఇవ్వక తప్పడం లేదు. మహిళలు మెచ్చే పంజాబి డ్రస్ కుట్టను సాధారణ కూలీ 150 రూపాయలు, లైనింగ్‌తో సహా కుట్టను 300 రూపాయలు తీసుకుంటున్నారు.

జంట్స్ టైలర్లకంటే లేడీస్ టైలర్ల సంపాదన ఇంకాస్త మెరుగ్గా వుంది. ఒక జాకెట్ కుడితే డెబ్బై ఐదు నుంచి వంద రూపాయలు, లైనింగ్ జాకెట్ 200 రూపాయలు, మాడల్ జాకెట్ కుడితే 300 రూపాయల వరకు వసూలు చేస్తున్నారు. చిన్న పిల్లల బట్టలు కుట్టను కూడా ఏమాత్రం కూలీ తగ్గించడం లేదు. స్కూలు యూనిఫాం కుట్టను 250 రూపాయలు తీసుకుంటున్నారు. ఆడపిల్లలకు పట్టు లంగాలు కుట్టించను వెళ్తే 130 రూపాయల నుంచి 260 రూపాయల వరకు నిలబెట్టి వసూలు చేస్తున్నారు. టైలర్ల స్టిచ్చింగ్ ఛార్జీలు భరించలక చాలామంది రెడిమేడ్ బట్ట లను కొనేస్తున్నారు. సీజన్, అన్‌సీజన్‌ల ప్రభావం అంటూ ఏదీ లేకుండా నెల్లూరులో టైలర్ల ప్రభ వెలిగిపోతుంది.

# ప్రశాంతంగా గ్రూప్ వన్ పరీక్ష


పరీక్షా కేంద్రంలోనికి వెళ్తున్న అభ్యర్థులకు శల్యపరీక్షలు చేస్తున్న పోలీసులు.

గ్రూప్ – 1 పరీక్షలపై తెలంగాణా రాష్ట్ర సమితి దురుద్దేశ్యంతో కూడిన ఆరోపణలు చేయడం, బియిడి మూల్యాంకన పరీక్షలకు హాజరైన అధ్యాపకులపై దాడి జరిగిన నేపథ్యంలో రాష్ట్ర వ్యాప్తంగా సెప్టెంబర్ 5వ తేది జరిగిన గ్రూప్ – 1 పరీక్షలపై ప్రత్యేక శ్రద్ధ వహించారు. ఎలాంటి అవాంఛనీయ ఘటనలకు తావులేకుండా వుండేందుకు జిల్లాలో గట్టి చర్యలు చేపట్టారు. నగరంలో డికె మహిళా కళాశాల, విఆర్ కళాశాల, ఎస్ఆర్‌కె స్కూలు, సెయింట్ జోసెఫ్ పాఠశాల, నారాయణ ఇంజనీరింగ్ కళాశాలల్లో మొత్తం 8 కేంద్రాలలో పరీక్షలు నిర్వహించారు. మొత్తం 4582 మంది దరఖాస్తు చేసుకోగా 2208 మంది హాజరయ్యారు.

ఒకరోజు ముందు నుంచే పరీక్ష కేంద్రాల వద్ద పటిష్టమైన భద్రతా చర్యలు చేపట్టారు. ప్రతి అభ్యర్థిని క్షుణ్ణంగా తనిఖీ చేసిన తర్వాత పరీక్ష హాలులోకి అనుమతించారు. సీమాంధ్ర జెఎసి నాయకులు పరీక్షలు వ్రాసేందుకు వచ్చిన అభ్యర్థులను పూలమాలలతో స్వాగతించారు. డిఎస్పీ రాధిక ఆధ్వర్యంలో పోలీసులు బందోబస్తు చర్యలు నిర్వహించారు.

# నెల్లూరులో గ్లోబల్ హాస్పిటల్!


సందేమార్కెట్ వద్ద తాత్కాలిక గ్లోబల్ హాస్పిటల్‌ను ప్రారంభిస్తున్న ఎస్పీ దామోదర్. ప్రక్కన కలెక్టర్ రాంగోపాల్, హాస్పిటల్ ఛైర్మన్ డాక్టర్ కంచర్ల రవీంద్రనాథ్.

దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాలలో వైద్యసేవలు అందిస్తూ పేరు ప్రఖ్యాతులు గడించిన గ్లోబల్ హాస్పిటల్ ఇప్పుడు తన సేవలను జిల్లావాసులకు అందించేందుకు నూతనంగా హాస్పిటల్, ఇన్ఫర్మేషన్ సెంటర్‌ను సండేమార్కెట్ వద్ద ఏర్పాటు చేశారు. జిల్లావాసి, కాలేయ మార్పిడిలో అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్న డాక్టర్ కంచర్ల రవీంద్రనాథ్ ఈ హాస్పిటల్‌ను ఏర్పాటు చేయడం విశేషం. సెప్టెంబర్ 5న జిల్లా కలెక్టర్ రాంగోపాల్ ఆస్పత్రిని ప్రారంభించగా, ఎస్పీ దామోదర్ ఇతర విభాగాలను ప్రారంభించి రవీంద్రనాథ్ కృషిని అభినందించారు.

గ్లోబల్ హాస్పిటల్స్ ఛైర్మన్ డాక్టర్ రవీంద్రనాథ్ మాట్లాడుతూ అంతర్జాతీయ స్థాయి వైద్యాన్ని జిల్లా ప్రజలకు అందించాలన్న లక్ష్యంతో ఇన్ఫర్మేషన్ సెంటర్‌తో పాటు హాస్పిటల్‌ను ఏర్పాటు చేశామన్నారు. నిపుణులైన వైద్య బృందం ఆధ్వర్యంలో గుండె, కాలేయం, మెదడుకు సంబంధించిన అన్నిరకాల వ్యాధులకు ఇక్కడ వైద్య పరీక్షలు నిర్వహిస్తారని, శస్త్రచికిత్సలు అవసరమైన వారికి మద్రాస్, బెంగుళూరు, హైదరాబాద్‌లోని తమ హాస్పిటళ్లలో శస్త్ర చికిత్సలు చేస్తారన్నారు. ముఖ్యంగా హాస్పిటల్‌లో టెలిమెడిసిన్ సదుపాయం వుందన్నారు. దీని ద్వారా అవసరమైన సూచనలు, సలహాలను దేశవ్యాప్తంగా గల గ్లోబల్ హాస్పిటల్ సూపర్ స్పెషాలిటీ వైద్యుల నుంచి పొందే సౌలభ్యం వుందన్నారు. త్వరలో 150 పడకలతో పూర్తి స్థాయిలో హాస్పిటల్ సొంత భవనాన్ని నిర్మిస్తున్నట్లు చెప్పారు. అత్యున్నతమైన వైద్యాన్ని జిల్లావాసులకు సేవాభావంతో అందించాలన్నదే తమ ఉద్దేశ్యమన్నారు.

# విజయ డైరీలో రచ్చ!

విజయ డైరీలో గత పాలకవర్గంలో చోటుచేసుకున్న అవినీతి, అక్రమాలపై ప్రస్తుత పాలకవర్గం తూర్పారపట్టడంతో 4వ తేది జరిగిన పాలక మండలి సర్వసభ్య సమావేశం వాడివేడిగా జరిగింది. సమావేశం ప్రారంభం కాగానే డైరీ ఛైర్మన్ చిల్లకూరు సుధీర్‌రెడ్డి అవినీతి అక్రమాలపై చర్చ లేవనెత్తడంతో ఒక్కసారిగా వాతావరణం వేడెక్కింది. చాలాకాలంపాటు ఛైర్మన్‌గా వ్యవహరించిన ముప్పవరపు గోపాలకృష్ణయ్య చౌదరి హయాంలో 1.12 కోట్ల రూపాయలు దుర్వినియోగం అయ్యాయని ఆయన ఆరోపించారు. ఒక్కదానికీ లెక్కాపక్కా లేదని, ఆడిట్ జరగలేదని అందినంత దిగమింగారని అనడంతో సమావేశానికి హాజరైన గోపాలకృష్ణయ్య చౌదరి తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేశారు. అయినప్పటికీ సుధీర్‌రెడ్డి తనదైనశైలిలో వివరాలతో సహా సభ ముందుంచారు. 1990 – 95వ సంవత్సరంలో డైరీ పాలను ప్రొద్దుటూరు డైరీకి పాలపొడి కోసం పంపేవారని, దాంట్లో 85 లక్షల రూపాయల అవినీతి జరిగిందన్నారు. అంతేకాకుండా ఆ డబ్బును డైరీ అకౌంట్ల నుంచి చెల్లింపు చేశారని ఆరోపించారు. దీనికి చౌదరి సమాధానమిస్తూ తాను ఎలాంటి అవినీతికి పాల్పడలేదని, నియమనిబంధనలకు అనుగుణంగానే వ్యవహరించానని చెప్పారు.


మావోయిస్టుల మందుపాతరలో అశువులు బాసిన కాంగ్రెస్ కార్యకర్త బుర్రా నాగార్జునరెడ్డి తృతీయ వర్ధంతిని పురస్కరించుకొని నెల్లూరు సీమా సెంటర్‌లో ఆయన చిత్రపటానికి నివాళులర్పిస్తున్న ఆయన మిత్రులు, కుటుంబ సభ్యులు.

# రైతులకు ఎంత కష్టం!

**గతనెలలో జిల్లాలో కురిసిన అకాల వర్షం రైతుల వెన్ను విరిచింది. డెల్టాలో కోతకు సిద్ధమైన వరిపైరు మొలకెత్తడంతోపాటు, మెట్ట ప్రాంతంలో నువ్వుల పంట బాగా దెబ్బతినింది.**


అకాల వర్షాలకు దెబ్బతిన్న వరిపైరును పరిశీలిస్తున్న కలెక్టర్ రాంగోపాల్.


వర్షానికి తడిసి నేలవాలిన వరి పైరు.

గత నెలలో కురిసిన అకాల వర్షం కారణంగా పంట నష్టం కలిగిన రైతులు ప్రభుత్వ సాయం కోసం ఎదురుచూస్తున్నారు. వ్యవసాయ శాఖతోపాటు ఇతర శాఖలు కూడా పంట నష్టాలను సర్వే చేయడం జరిగింది. పంట నష్టాలను సర్వే చేసి నివేదికను ప్రభుత్వానికి పంపారా లేదా అనేది అధికారులు వెల్లడించేందుకు నిరాకరిస్తున్నారు. వర్షం కారణంగా తడిసిన ధాన్యాన్ని వ్యాపారులు కొనుగోలు చేయకపోవడంతో ధాన్యాన్ని ఇళ్లకు చేర్చి ఎండబెట్టుకుంటున్నారు రైతులు.

రెండవ కారు వేసిన రైతులు కొందరు వరికోతలు కోయగా మరికొందరు రైతులు కోతకోసే దశలో వున్నారు. వున్నపళంగా భారీ వర్షాలు కురవడంతో వరికోతలు కోసిన రైతులు తీవ్ర ఇబ్బందులకు గురికావాల్సి వచ్చింది. వరికోత యంత్రాలతో కోత కోయించి ధాన్యాన్ని పొలాల్లోనే వుంచుకున్నారు. ధాన్యం కొనుగోలుకు వ్యాపారులు వస్తారన్న ఆశతో ధాన్యాన్ని ఇంటికి తరలించడం మానేశారు రైతులు. ఎడతెరిపి లేకుండా వర్షం కురవడం కారణంగా ధాన్యం తడిసి పోయింది. తడిసిన ధాన్యాన్ని కొనుగోలు చేసేందుకు వ్యాపారులు ముందుకు రావడం లేదు. దీంతో ఏం చేయాలో దిక్కుతోచని స్థితిలో రైతులు వున్నారు.

> **గిట్టుబాటు ధర కల్పించకుంటే చర్యలు!**
>
> 
>
> జిల్లాలో రెండవ పంటవేసిన రైతులకు గిట్టుబాటు ధర కల్పించేందుకు అన్ని చర్యలు తీసుకోవడం జరుగుతుంది. వ్యాపారులు, రైస్ మిల్లర్లకు కూడా వరి ధాన్యానికి మద్దతు ధర ఇవ్వాలని ఆదేశించడం జరిగింది. రైతులకు ఎటువంటి నష్టం జరగకుండా ప్రభుత్వపరంగా అన్ని చర్యలు తీసుకుంటున్నాం.
>
> *సౌరబ్‌గౌర్, జిల్లా జాయింట్ కలెక్టర్.*

## రైతుల్లో ఆందోళన!

ప్రస్తుతం వరికోతలు కోస్తున్న రైతుల్లో ఆందోళన ఏర్పడింది. జిల్లావ్యాప్తంగా వరికోతలు కోస్తున్నారు. ఇప్పటికే దాదాపు 40 శాతం వరికోతలు పూర్తికాగా కోయాల్సిన మిగిలిన పంట వర్షం కారణంగా వాయిదా పడితే రైతులు తీవ్ర నష్టాలను చవిచూడాల్సి వుంటుంది. జిల్లాలో రెండవ పంట దాదాపు మూడు లక్షల 50వేల ఎకరాల్లో సాగుబడి అయ్యింది. వరికోత యంత్రాల ద్వారా రోజుకు 30వేల ఎకరాల్లో కోతలు జరుగుతున్నాయి. ఇంకా కోయాల్సిన పంటను కోయకుండా మరో వారం రోజులపాటు వాయిదావేస్తే నష్టం సంభవించే అవకాశం వుంది. ఆ తర్వాత పంట కోసినా విక్రయించడం కష్టతరంగా మారుతుంది. ధాన్యం రంగు మారడం, నల్లమచ్చ వుందన్న సాకుచూపి వ్యాపారులు అతి తక్కువ ధరకు కొనుగోలుకు సిద్ధపడతారు. ఇంతకు ముందు ఎన్నడూలేని విధంగా ఈ నెలలో వర్షాలు రావడంతో రైతులు ఆవేదన చెందుతున్నారు.

ఇప్పటికే రైతులు నెల్లూరు, గూడూరు డివిజన్లలో అధికంగా వరి పంట వేయగా, కావలి డివిజన్‌లో అల్లూరు, కొడవలూరు, విడవలూరు మండలాల్లో ఆలస్యంగా వరి పంట వేశారు. పంట కోత దశలోకి వచ్చిన సమయంలో వర్షం కారణంగా నీటమునగడంతో రైతులు నెత్తినోరు మొత్తుకుంటున్నారు. జిల్లాలో సాధారణంగా అక్టోబర్, నవంబర్, డిసెంబర్ నెలల్లో వర్షాలు కురుస్తుంటాయి. ఈ సంవత్సరం ఇందుకు భిన్నంగా వర్షాలు కురిశాయి. వాయుగుండం, తుఫాను ప్రభావంతో వర్షపాతం ఎక్కువగా నమోదు కాబడింది.

ఏప్రెల్, మే నెలల్లో రైతులు రెండవ పంట వేసుకున్నారు. సెప్టెంబర్ నాటికి జిల్లాలో రెండవ పంట వరికోతలు పూర్తవుతాయి. ఇటీవల కురిసిన భారీ వర్షాలకు పొలంలో నిలువుగా వున్న వరి నేల వాలింది. నేలవాలిన వరిని ఎలా కోత కోయాలని రైతాంగం దిగులు చెందుతుంది. అసలే వరి ధాన్యానికి గిట్టుబాటు ధరలేక ఆందోళన చెందుతున్న నేపథ్యంలో రైతులను ఈ భారీ వర్షాలు మరింత ఇబ్బందుల పాల్జేశాయి. వరిసాగుకు బయట అప్పులు చేసి పెట్టుబడి పెట్టిన అన్నదాతలు గిట్టుబాటు ధర లేకుంటే ఏం చేయాలని మధనపడుతున్నారు.

## 8వేల ఎకరాల్లో నష్టం

జిల్లాలో ఇటీవల కురిసిన భారీవర్షాల కారణంగా దాదాపు ఎనిమిది వేల ఎకరాల్లో వరిపంటకు నష్టం వాటిల్లినట్లు వ్యవసాయ శాఖ అధికారులు ప్రాథమిక అంచనా వేశారు. జిల్లాలో అల్లూరు, కొడవలూరు, కోవూరు, ఇందుకూరుపేట, టి.పి.గూడూరు, ముత్తుకూరు మండలాల్లో వరిపంటకు నష్టం జరిగింది. జిల్లా వ్యవసాయ శాఖ ఆధ్వర్యంలో జరిగిన వరి పంట నష్టాలను పూర్తిస్థాయి అంచనా వేసేందుకు సర్వే బృందాలను ఏర్పాటు చేశారు.

## దగా చేస్తున్న వ్యాపారులు

రెండవ పంట వేసిన ప్రాంతాల్లో ధాన్యం కొనుగోలు చేసే విషయంలో వ్యాపారులు, మిల్లర్లు రైతుల్ని దగా చేస్తున్నారు. ధాన్యానికి గిట్టుబాటు ధర కల్పించకపోగా బియ్యాన్ని అధిక ధరలకు విక్రయిస్తున్నారు. రెండవ పంటగా 1001, 1010, నెల్లూరు మసూరాలను వేయడం జరిగింది. పుట్టి ధాన్యం రంగు మారకుండా తేమ లేకుండా వుంటే రూ.7,500లకు కొనుగోలు చేస్తున్నారు. ఏదైనా లోపం వుంటే రూ.7,000లకే కొనుగోలు చేస్తున్నారు.

## 6వేల ఎకరాల్లో నువ్వు పంటకు నష్టం!

భారీ వర్షాల కారణంగా మెట్ట ప్రాంతాల్లో కూడా తీవ్ర నష్టం జరిగింది. వింజమూరు, కలిగిరి, కొండాపురం, జలదంకి తదితర మండలాల్లో దాదాపు ఆరువేల ఎకరాలకు పైగా నువ్వు పంటకు అపార నష్టం చేకూరింది. ఇది కేవలం ప్రాథమిక అంచనా మాత్రమే. వ్యవసాయ శాఖ అధికారులు సమగ్ర సర్వే జరిపితే ఈ అంచనాలు మరింత పెరిగే అవకాశం వుంది. గత మే నెలలో సంభవించిన లైలా తుఫాను కారణంగా వాటిల్లిన నష్టాలకే ఇంతవరకు ప్రభుత్వం బాధితులకు పరిహారం అందించలేదు.

ప్రస్తుతం కురిసిన భారీ వర్షాలకు వాటిల్లిన నష్టాలకు ఎప్పటికి పరిహారం అందుతుందోనని రైతులు సందేహం వ్యక్తం చేస్తున్నారు. మరో ప్రక్క రాష్ట్ర ప్రభుత్వం నుంచి కూడా నష్టాలకు సంబంధించి ఎటువంటి ప్రకటన చేయలేదు. వ్యవసాయశాఖ, ఉద్యానవన శాఖ, నీటి పారుదల శాఖలకు చెందిన అధికారులు తమ శాఖల పరంగా జరిగిన నష్టాలను అంచనా వేసే పనుల్లో నిమగ్నమై వున్నారు. ఊహించని విధంగా వరిపంట, నువ్వు పంటలకు నష్టాలు సంభవించడంతో రైతులు అప్పులు పాలయ్యే ప్రమాదం వుంది.

## పంట నష్టాలను కలెక్టర్ పరిశీలన

జిల్లాలో భారీవర్షాల కారణంగా దెబ్బతిన్న పంటపొలాలను జిల్లా కలెక్టర్ కె.రాంగోపాల్ పరిశీలించారు. ఇందుకూరుపేట, టి.పి గూడూరు మండలాలతోపాటు మెట్టప్రాంతమైన ఆత్మకూరు తదితర మండలాలలో ఆయన పర్యటించారు. జరిగిన నష్టాలను అంచనా వేసి రైతులకు తగిన పరిహారం అందించేందుకు కృషి చేస్తానని చెప్పారు. నష్టపోయిన రైతాంగానికి అన్ని విధాలుగా చేయూతనివ్వాలని ప్రభుత్వానికి నివేదించడం జరుగుతుందని ఆయన చెప్పారు.

## నష్టాలను వివరించలేని అధికారులు

భారీ వర్షాల కారణంగా జిల్లాలో దెబ్బతిన్న వరి పంట నష్టాలపై పూర్తి వివరాలు వ్యవసాయ శాఖ అధికారులు వెల్లడించలేకపోయారు. ఈనెల 4తేదిన జడ్పీ కార్యాలయంలో జరిగిన వ్యవసాయశాఖ స్టాండింగ్ కమిటీ సమావేశంలో పాల్గొన్న అధికారులను పంట నష్టాల వివరాల గురించి ఛైర్మన్ ప్రశ్నించారు. ఈ సందర్భంగా ఛైర్మన్ మాట్లాడుతూ పరిహారం అందించేందుకు సంబంధిందిత శాఖ అధికారులు తగిన చర్యలు తీసుకోవాలని అధికారులను ఆదేశించారు. ఎక్కడా రైతులకు ఇబ్బందులు కలుగకుండా నష్టాల వివరాలను నమోదు చేసుకోవాలని సూచించారు. అయితే వ్యవసాయశాఖ అధికారులు పంట నష్టాలకు సంబంధించిన పూర్తి సమాచారం అందించలేకపోవడం విశేషం. J



కేతా అంకులు మెమోరియల్ ట్రస్ట్ నేతృత్వంలో నెల్లూరు సుబేదారుపేటలోని ప్రభుత్వ పాఠశాలలో జరిగిన ఉపాధ్యాయ దినోత్సవంలో సర్వేపల్లి రాధాకృష్ణన్ చిత్రపటానికి పూలమాల వేస్తున్న ఆర్వీ.శేషయ్య నాయుడు. ప్రక్కన అద్దేపల్లి శ్రీమన్నారాయణ, వై.రత్నమ్మ, ఉపాధ్యాయులు దేవసేనమ్మ, లక్ష్మమ్మ.



నెల్లూరు పొదలకూరురోడ్డులోని క్యాన్సర్ ఆస్పత్రి అభివృద్ధి కోసం జిల్లా కలెక్టర్ రాంగోపాల్‌కు లక్ష రూపాయల విరాళాన్ని అందిస్తున్న యల్లాయపాళెం గ్రామ ప్రముఖుడు సిపి.రెడ్డి ఆయన సతీమణి బుజ్జమ్మ. ప్రక్కన రెడ్‌క్రాస్ జిల్లా కార్యదర్శి డాక్టర్ ఎవి. సుబ్రహ్మణ్యం.



వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ప్రథమ వర్ధంతిని పురస్కరించుకొని జొన్నవాడలోని వృద్ధుల ఆశ్రమంలో పండ్లు పంపిణీ చేస్తున్న జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ.




కార్మికుల సార్వత్రిక సమ్మె సందర్భంగా నెల్లూరులో సిఐటియు కార్మిక సంఘం ర్యాలీ.

# ఆత్మకూరు పంచాయితీలో అవినీతి కంపు!

## ఎవరికి అందినంత వారు దోచుకొంటున్నారు

ఆత్మకూరు పంచాయితీ పరిధిలో పాలకవర్గం, అధికారులు వ్యవహరిస్తున్న తీరుపై ప్రజల నుంచి వ్యతిరేకత వ్యక్తమవుతోంది. పట్టణంలో ఎక్కడ చూసినా పారిశుధ్యం క్షీణించి వుండటమే కన్పిస్తుంది. వీధిలైట్లు వెలగక కొన్ని ప్రాంతాల్లో చిమ్మ చీకట్లు కమ్ముకొని వుంటే, మరికొన్ని ప్రాంతాల్లో పగలు రాత్రి అనే తేడా లేకుండా వీధిలైట్లు వెలుగుతుంటాయి. దోమల బెడద, మురుగునీరు పొంగి పొర్లుతున్నా పాలకవర్గానికి చీమకుట్టినట్లయినా లేదు. ఎవరికి వారు అందినంత దోచుకొనేందుకు ప్రయత్నిస్తున్నారు తప్ప ప్రజల బాగోగులు పట్టించుకోవడం లేదు. వాటర్ ట్యాంకర్‌కు నెలకు ఐదువేల రూపాయల అద్దె చెల్లిస్తున్నట్లు రికార్డుల్లో వ్రాస్తూ సగం సొమ్ము దిగమింగుతున్నారట. ఇప్పటికి లక్షా 80వేల రూపాయలు ట్యాంకర్‌కు అద్దె చెల్లించారు. ఆ మొత్తాన్ని పెడితే ట్యాంకర్‌ను పంచాయితీ కొనుగోలు చేయొచ్చు. అయినా ఆ దిశగా ఆలోచించకుండా తమకు ఎక్కడ తినే అవకాశం వుంటుందో ఆ వైపే మొగ్గు చూపుతున్నారు. పట్టణంలో పారిశుధ్యం క్షీణించినా బ్లీచింగ్ చల్లిన పాపానపోలేదు. కానీ మూడు నెలలకోసారి బ్లీచింగ్ ఖర్చులకు 50వేల రూపాయలు లెక్క వ్రాసేస్తున్నారు. చివరకు లిఫ్ట్ ఇరిగేషన్ స్కీం దగ్గరున్న మూడు టేకు చెట్లను 10వేలకు ముగ్గురు సిబ్బంది తెగనమ్మి ఆ మొత్తాన్ని దిగమింగారు. పాలకవర్గ సభ్యులు, అధికారులు ఈ విధంగా దోపిడీ చేస్తున్నా ఎవరూ పట్టించుకోకపోవడం విమర్శలకు తావిస్తోంది.

# దగదర్తిలో రైతుల లబోదిబో!

## దెబ్బతీసిన అకాల వర్షం

ఇటీవల కురిసిన అకాల వర్షాలతో రైతుల పరిస్థితి దారుణంగా తయారైంది. పంటలు దెబ్బతిని పోవడంతో రైతులు ఆందోళన చెందుతున్నారు. దగదర్తి మండలంలో భారీగా కురిసిన వర్షాలతో పంటలు పూర్తిగా దెబ్బతిన్నాయి. వివిధ గ్రామాలలో కోత చివరిదశలో వున్న పైరు ధ్వంసమైపోయింది. చాలాచోట్ల పైరు నీట మునిగిపోయింది. పలు ప్రాంతాలలో వర్షపు నీరు చేరడం, నీరు బయటకుపోయే వీలు లేకపోవడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడ్డారు. గిరిజన కాలనీ మొత్తం నీరు చేరిపోయింది. దగదర్తి, పెద్దపుత్తేడు, చెన్నూరు, తురిమెర్ల, దామవరం తోపాటు పలు గ్రామాల ప్రజలు అవస్థలు పడ్డారు. పైడేరు వంతెన శిథిలావస్థకు చేరుకోవడం, అధికారులు దాని మరమ్మత్తులు పట్టించుకోకపోవడంతో వర్షాకాలంలో ప్రజలు ఈ వంతెనపై నడవాలంటేనే ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని తిరగాల్సివస్తోంది. ఇప్పటికైనా అధికారులు దెబ్బతిన్న బ్రిడ్జికి మరమ్మత్తులు చేపట్టాలని ప్రజలు కోరుతున్నారు.

# దుర్భరస్థితిలో గిరిజనులు

ముత్తుకూరు మండలం పైనాపురం పంచాయితీలోని దేవరదిబ్బ గిరిజన కాలనీలోని గిరిజనులు దుర్భరస్థితుల్లో జీవిస్తున్నారు. ఈదూరు రామకృష్ణారెడ్డి సర్వేపల్లి ఎమ్మెల్యేగా వున్నప్పుడు 1987లో ఇక్కడ గిరిజనులకు పక్కాగృహాలను నిర్మించి ఇచ్చారు. మొత్తం 72 గృహాలను ఏర్పాటుచేయగా కాలక్రమేణా అవి శిథిలమైపోయాయి. గృహాలన్నీ పగుళ్లిచ్చి, కిటికీలు, తలుపులు ఊడిపోయి ధ్వంసమైయాయి. కూలిపోయేందుకు సిద్ధంగా వున్న ఆ గృహాల్లో నివసించే వీలు లేకపోవడంతో గత కొన్నేళ్లుగా చెట్లక్రిందే

### చేపలే జీవనాధారం

జీవనం సాగిస్తున్నారు గిరిజనులు. దీనికి తోడు వీరికి ఉపాధి లేకుండా పోయింది. ఉప్పుకాలవలో చేపలు పట్టి వచ్చిన దాంతో కుటుంబాలను పోషించుకొనేవారు. వివిధ ప్రాజెక్టులు రావడం వాటి ఏర్పాటుకు భూములను సేకరించడం, ఉప్పు కాలువను పూడ్చేయడంతో గిరిజనులు ఉపాధి కోల్పోయారు. అటు నివసించేందుకు ఇళ్లులేక, ఇటు జీవించేందుకు పనులు లేక అల్లాడిపోతున్నారు గిరిజనులు. వీరి దుర్భర పరిస్థితి మాత్రం పాలకులకు, అధికారులకు పట్టకపోవడం విచారకరం.

# వీఆర్వో ఆఫీసులతో సత్ఫలితాలు!

## మండల కేంద్రానికి పోనక్కరలేదు.

ఆత్మకూరు మండలంలో ఏర్పాటుచేసిన గ్రామ రెవెన్యూ అధికారుల కార్యాలయాల ఏర్పాటు సత్ఫలితాలనిస్తుంది. గతంలో ఏమైనా రెవెన్యూ పరమైన అంశాలకు సంబంధించి సమస్యలు పరిష్కరించుకోవాలంటే మండల కేంద్రంలో వుండే తహశీల్దార్ కార్యాలయానికి పోవాల్సి వచ్చేది. ఈ కార్యాలయాల ఏర్పాటుతో ఆ సమస్య తీరింది. ప్రజలకు వివిధ ధృవీకరణ పత్రాలు, ఇతరత్రా సమస్యలు అక్కడికక్కడే పరిష్కారం అవుతున్నాయి. మండలంలో మొత్తం 24 పంచాయితీలు వుండగా 15 రెవెన్యూ క్లస్టర్లుగా విభజించారు. అందులో 8 క్లస్టర్లకు మాత్రం కార్యాలయాలు ఏర్పాటయ్యాయి. వీరందరినీ ఇటీవల జరిగిన ఒక కార్యక్రమంలో తహశీల్దార్ శ్రీనివాసమూర్తి అభినందించి జ్ఞాపికలను అందజేశారు.

# యాష్‌పాండ్ లబ్దిదారులకు ఊరట!

కృష్ణపట్నం థర్మల్‌కు రిలయన్స్ ద్వారా సేకరించిన తోటపల్లిగూడూరు మండలం మండపం, చంద్రశేఖరపురం గ్రామాలలో యాష్‌పాండ్ కోసం సేకరించిన 215 ఎకరాల సిజెఎఫ్ఎస్ భూములకు ఎకరాకు ఆరులక్షలా పదహారువేలు ఇవ్వను రెవెన్యూ అధికారులు సమ్మతించారు. తొలుత ఎకరాకు నాలుగు లక్షలా పదహారు వేలు చెల్లిస్తామని అధికారులు ప్రకటించారు. దీంతో రైతులు ఆందోళన పథం తొక్కారు. సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి పలు దఫాలుగా జిల్లా కలెక్టర్ రాంగోపాల్‌తో సమావేశమై అదనంగా రెండు లక్షలు చెల్లించాల్సిన అవసరం, రైతుల స్థితిగతులను వివరించారు. ఆర్డీఓ వేణుగోపాల్ రెడ్డి, తహశీల్దార్ లక్ష్మీనారాయణ కూడా వాస్తవ నివేదిక పంపడంతో జిల్లా కలెక్టర్ ఈ ప్రతిపాదన అంగీకరించారు.



సేవాభారతి నేతృత్వంలో నెల్లూరు భక్తవత్సలనగర్ కెవిఆర్ఎం. హైస్కూల్ ప్రాంగణంలో జరిగిన ఈ యేడాది టెన్త్ టాపర్ల బహుమతి ప్రధాన సభలో మాట్లాడుతున్న డిఇఓ బాలకాశయ్య. వేదికపై ఆపస్ నాయకుడు పోలయ్య, హెడ్మాస్టర్ విజయప్రకాష్, అల్లూరు రహీం, జి.గురునాథం, సత్యనారాయణ వున్నారు.

# ఓదార్పు యాత్రకు వెళ్లాలా... వద్దా?

## ఆత్మకూరు నాయకుల మల్లగుల్లాలు!

జిల్లాలో జగన్ చేపట్టనున్న ఓదార్పు యాత్రపై ఆత్మకూరు కాంగ్రెస్ నేతలు మల్లగుల్లాలు పడుతున్నారు. నిజానికి జగన్ యాత్రలో పాల్గొనాలన్న అభిప్రాయం ద్వితీయశ్రేణి నాయకుల్లో మెండుగా వుంది. మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్న ఈ నియోజకవర్గంలో వైఎస్‌కు అభిమానులు అధికసంఖ్యలో వున్నారు. అయితే మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఓదార్పు యాత్ర పట్ల మౌనం వహించడం, అధిష్టానం మాటే శిరోధార్యం అనడంతో ఈ ప్రాంత నేతల పరిస్థితి అయోమయంగా మారింది. మంత్రితో దగ్గరగా మసలేవాళ్లు ఆయన అనుమతితోనే పాల్గొనాలని భావిస్తుండగా, సాధారణ కార్యకర్తలు మాత్రం అధికసంఖ్యలో పాల్గొనేందుకు మొగ్గ చూపుతున్నారు. ఇక మంత్రి వద్దంటే ఎంతమంది వెనక్కు తగ్గుతారో చూడాల్సి వుంది. మేకపాటి సోదరులు మాత్రం తమకున్న బంధువర్గం, అనుచరులతో మంతనాలు జరిపి అధిక సంఖ్యలో జనం పాల్గొని యాత్ర విజయవంతమయ్యేలా చూసేందుకు తగిన ప్రయత్నాలు చేస్తున్నారు.

# విద్య వ్యాపారమైంది!

## జడ్పీ ఛైర్మన్ ఆవేదన

విద్యారంగంలోకి కార్పొరేట్ సంస్థలు ప్రవేశించడంతోనే విద్య వ్యాపారం అయిందని ఫలితంగా విద్యార్థుల మానసిక పరిస్థితి దెబ్బతింటున్నాదని జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి వ్యాఖ్యానించారు. బుచ్చి మండలం రామచంద్రాపురంలోని గుత్తికొండ శ్రీరాములు విద్యాసంస్థలో జరిగిన ప్రతిభా పురస్కారాల ప్రదానోత్సవ కార్యక్రమానికి ఆయన ముఖ్య అతిథిగా హాజరయ్యారు. దాతృత్వం గల వాళ్లు పట్టణాలలో కాక గ్రామీణ ప్రాంతాలలో విద్యాసంస్థలను స్థాపించినట్లయితే విద్యార్థులకు ఉపయోగకరంగా వుంటుందన్నారు. ఉపాధ్యాయులు విద్యార్థులను తీర్చిదిద్దేందుకు తగినకృషి చేయాలన్నారు. గ్రామీణ ప్రాంతాల్లోని వారు బాగా చదువుకొన్నట్లయితే ఉన్నత శిఖరాలను అధిరోహించవచ్చుంటూ, ఇందుకు ఉదాహరణగా సభకు విచ్చేసిన ఐఎఎస్ అధికారి కృష్ణయ్యను చూపారు. విద్యార్థులు చదువుతోపాటు కమ్యూనికేషన్ స్కిల్స్‌ను పెంపొందించుకోవాలని ఫిషరీస్ డెవలప్‌మెంట్ బోర్డు సిఇఓ కృష్ణయ్య సూచించారు. అనంతరం యూనివర్శిటీ స్థాయిలో జిల్లా ఫస్ట్ వచ్చిన ముకుందవల్లికి లక్ష రూపాయల నగదును అందజేశారు. ఈ కార్యక్రమంలో కళాశాల ఛైర్మన్ దోనిపర్తి వెంకయ్య, బెజవాడ ఓబుల్‌రెడ్డి, ప్రిన్సిపాల్ సీతారామానాయుడు, విజయభాస్కర్‌రెడ్డి, మధురెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## దుస్థితిలో పాఠశాలలు

ముత్తుకూరు మండలం పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి చెందుతున్నప్పటికీ పాఠశాలల పరిస్థితి మాత్రం అధ్వాన్నంగా వుంది. చాలీచాలని గదులు, పూర్తిగా అందని పుస్తకాలతో విద్యార్థులు అవస్థలు పడుతున్నారు. ముత్తుకూరు జడ్పీహైస్కూల్‌లో గదులు చాలకపోవడంతో చెట్ల క్రిందే విద్యార్థులు చదువుకోవాల్సి వస్తోంది. వర్షాకాలంలో వీరి అవస్థ వర్ణనాతీతం. వానొస్తే చెట్ల క్రింద పాఠాలు చెప్పే వీలు లేకపోవడంతో పాఠశాలకు సెలవు ఇవ్వాల్సిన దుస్థితి ఏర్పడింది. రాజీవ్ విద్యామిషన్, జడ్పీ నిధులు కోట్ల రూపాయలు వెచ్చిస్తున్నా పాఠశాలల్లో మాత్రం మౌలిక సదుపాయాలు ఏర్పడడం లేదు. ఆర్థిక స్థోమతలేక, ఇంగ్లీషు మీడియం స్కూలుకు పంపించలేని పేద తల్లిదండ్రులు తమ పిల్లలను ఇలాంటి పాఠశాలల్లో చదివించాల్సి రావడం పట్ల తీవ్ర ఆవేదన చెందుతున్నారు.

## చెరువు మరమ్మత్తులకు హామీ!

కోవూరుపల్లి చెరువు రోజురోజుకు ఆక్రమణలకు గురవుతుండడంతో పంచాయితీకి చెందిన రైతులు తీవ్ర ఆందోళన చెందుతున్నారు. 90ఎకరాలు వున్న చెరువులో చాలా భాగం ఆక్రమణలకు గురైంది. దీంతో తరచూ గండ్లు పడుతుండేవి. దీన్ని పలుమార్లు అధికారులకు విన్నవించినా స్పందించకపోవడంతో స్థానిక సర్పంచ్ సుప్రజ, ఆమె భర్త తెలుగు యువత ప్రధాన కార్యదర్శి ఇందుపూరు ధనుంజయరెడ్డి సమస్య పరిష్కారానికి నడుంబిగించారు. చెరువు మరమ్మత్తుల విషయమై కాంట్రాక్టర్ ముందుకురాక, అధికారులు పట్టించుకోక సమస్య పరిష్కారానికి నోచుకోలేదు. రైతులందరూ దీనిపై సమావేశం అయ్యారు. ధనుంజయరెడ్డి మాట్లాడుతూ ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావును కలిసి జిల్లా కలెక్టర్ దృష్టికి తీసుకపోయి సమస్య పరిష్కారానికి కృషి చేస్తానని హామీ ఇచ్చారు.

## దుస్తుల పంపిణీ

బుచ్చిరెడ్డిపాళెం మండలం పంచేడు పంచాయితీ పరిధిలోని నాలుగు పాఠశాలల విద్యార్థులకు స్థానిక లిక్కర్ వ్యాపారి సూరా శ్రీనివాసులురెడ్డి దుస్తులను పంపిణీ చేశారు. మొత్తం రెండు లక్షల రూపాయలు వెచ్చించి ఒక్కో విద్యార్థికి రెండు జతల యూనిఫాంలను స్థానిక ఎమ్మెల్యే నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి చేత అందజేశారు. ఈ సందర్భంగా ప్రసన్న మాట్లాడుతూ డబ్బు సంపాదనతోపాటు దాతృత్వం అలవాటు చేసుకోవాలన్నారు. వున్నదాంట్లో పేదలకు సహాయం చేస్తున్న శ్రీనివాసులురెడ్డిని ఆయన అభినందించారు.

## పని చేస్తారా... బదలీపై వెళ్తారా?

సూళ్లూరుపేట మండలంలో పర్యటించిన ఎమ్మెల్యే పరసా రత్నం అధికారుల తీరుపై విరుచకపడ్డారు. మండలం నుంచి పలువురు ప్రజలు వివిధ సమస్యలపై అధికారుల చుట్టూ తిరుగుతున్నా పట్టించుకోవడం లేదని ఎమ్మెల్యే దృష్టికి తీసుకొని రావడంతో ఆయన అధికారులపై మండిపడ్డారు. ప్రజాసమస్యలు పరిష్కరించేందుకు గ్రీవెన్స్‌డే ఏర్పాటు చేసినప్పటికీ అధికారులెవరూ రాకపోవడాన్ని ఆయన ప్రస్తావిస్తూ ఇదేనా మీ బాధ్యత. ప్రజలకు సేవ చేయడం ఇలాగేనా, వారి సమస్యలు మీకు పట్టవా అంటూ ఆగ్రహం వ్యక్తం చేసిన ఆయన పనిచేయలేకపోతే బదలీ చేయించుకొని వెళ్లిపోండి అని హెచ్చరించారు. ప్రతిపక్ష పార్టీ ఎమ్మెల్యేనని తక్కువ చేసి చూసినా, ప్రజ సమస్యల పట్ల అలసత్వం ప్రదర్శించినా పరిణామాలు తీవ్రంగా వుంటాయని హెచ్చరించడంతో అధికారులు ఆయనను శాంతపరచేందుకు నానా అగచాట్లు పడ్డారు.

# రైతు సేవాతత్పరత!

నేతల ఆశయాలకు అనుగుణంగా పని చేయాలని, వారు చూపిన మార్గంలో పయనించాలని పలువురు వేదికలనెక్కి ఉపన్యసిస్తుంటారు. కానీ తక్కువ మంది దానిని ఆచరిస్తుంటారు. ఈ కోవకు చెందిన వ్యక్తే బోగోలుకు చెందిన బొడ్డు ప్రభాకర్‌రెడ్డి. రైతయిన ఆయన వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వీరాభిమాని. ఆయన ఆశయాలకు తగినట్లు సేవా కార్యక్రమాలు చేస్తుంటాడు. బోగోలు రైల్వేగేటు వద్ద రోడ్డు దెబ్బతినిపోయి వర్షం పడితే నీరు నిలచి రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడేది. చెత్తాచెదారం చేరి

**చెప్పడం కాదు... చేసి చూపారు!**

బురదమయమై దుర్వాసన వెదజల్లుతుండడంతో ఈ గేటు గుండా రాకపోకలు సాగించేవాళ్లు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. వీరి సమస్యను గుర్తించిన బొడ్డు ప్రభాకర్‌రెడ్డి, మోహన మురళీరెడ్డితో కలిసి సొంత నిధులను వెచ్చించి మట్టి, కంకర తోలించి ఆ మార్గాన్ని చదును చేయించారు. అధికారులు, పాలకులు పట్టించుకోని సమస్యను ప్రభాకర్‌రెడ్డి స్పందించి పరిష్కరించడం పట్ల బోగోలు, చుట్టుప్రక్కల ప్రాంత ప్రజలు ఆయన్ను అభినందిస్తున్నారు.

# రైతులను ఆదుకొంటాం!

## కలెక్టర్ మాటిచ్చారు

ఇటీవల కురిసిన వర్షాలకు తోటపల్లిగూడూరు, ఇందుకూరుపేట మండలాల్లో నీటమునిగిన పైర్లను జిల్లా కలెక్టర్ రాంగోపాల్ పరిశీలించారు. జంగందొరువు, పొట్లపూడి, చింతోపు, సౌత్‌ఆములూరు గ్రామాల్లో నీటమునిగిన పంటను పరిశీలించిన అనంతరం రైతులతో మాట్లాడారు. గతంలో పెసర పంటకు నష్టం జరిగినా ఇప్పటివరకు పరిహారం అందలేదని రైతులు కలెక్టర్ దృష్టికి తీసుకొని వచ్చారు. ప్రస్తుత నష్టాలను అంచనా వేసి సహాయం అందిస్తామని కలెక్టర్ హామీ ఇచ్చారు. ధాన్యం బాగాలేదన్న సాకుతో రైతుల నుంచి తక్కువ ధరకు ధాన్యం కొనుగోలు చేసే వారిపై చర్యలు తీసుకొంటామన్నారు. విజయాడైరీ ఛైర్మన్ చిల్లకూరు సుధీర్‌రెడ్డి రైతుల సమస్యలను కలెక్టర్‌కు వివరించారు. కలెక్టర్ వెంట వ్యవసాయశాఖ జెడి చెల్లప్ప, ఆర్‌డిఓ వేణుగోపాలరెడ్డి, తహశీల్దార్లు రామకృష్ణ, లక్ష్మీనారాయణ, ఎడి రవిచంద్ర ప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.



## ఆందోళనలపైనే 'బాబు', 'చిరు' గురి!

ప్రజల మద్దతు సంపాదించడానికి ఆందోళనలే శరణ్యమని చంద్రబాబు, చిరంజీవి గట్టిగా నమ్ముతున్నారు. ప్రస్తుతం రాష్ట్రంలో నెలకొన్న రాజకీయ అనిశ్చితిలో ప్రజాసమస్యలపై రచ్చకెక్కి పోరాటాలు, ఆందోళనలు చేయడం మినహా మరో మార్గం లేదన్నది వారి అభిప్రాయం. ఇటీవల బాబ్లీపై పోరాటం చేసిన బాబు ఇప్పుడు విద్యార్థుల ఫీజు రీయంబర్స్‌మెంట్‌పై ఆందోళన చేపట్టాడు. పోలవరానికి జాతీయ గుర్తింపు కోసం ఉద్యమించిన చిరంజీవి ప్రస్తుతం గిరిజనుల సమస్యలపై దృష్టి పెడుతున్నాడు. వచ్చే ఎన్నికల దాకా ప్రజాందోళనల్ని కొనసాగిస్తే ప్రజల మద్దతు పొందడం పెద్ద కష్టమేమీ కాదన్నది వీరిరువురు గట్టిగా నమ్ముతున్నారు. అయితే రాజకీయ వర్గాల కథనం మాత్రం మరోలా వుంది. వైఎస్ తనయుడు జగన్ ఓదార్పు ద్వారా జనానికి దగ్గరవుతున్నాడనే చిరు, బాబు ఈ ఎత్తుగడ పన్నారన్నది రాజకీయుల ఉవాచ.



## పట్టు తప్పిన పరిపాలన

రాష్ట్రప్రభుత్వ పరిపాలన పట్టు తప్పింది. మంత్రులు, అధికారులు ఎవరిదారి వారిదన్నట్లు వ్యవహరిస్తున్నారు. సచివాలయం స్తబ్దుగా మారింది. గత పది రోజులుగా ముఖ్యమంత్రి అస్వస్థత కారణంగా సచివాలయానికి సరిగా రావడం లేదు. దీంతో సచివాలయంలో పనులు స్తంభించాయి. మంత్రులు కూడా ఆటవిడుపుగా వున్నారు. కొంతకాలంగా ఆయా శాఖల సమీక్షలు కూడా మూలపడ్డాయి. రాష్ట్రంలో రాజకీయం కూడా అనిశ్చితిగా వుండటంతో ఎప్పుడేం జరుగుతుందన్న విషయమై ఐఎఎస్‌లు చర్చించుకోవడం ఎక్కువైంది. రోజు వారీ పరిష్కరించాల్సిన ఫైళ్లు కూడా మూలబడ్డాయి. పనిపాటా లేకపోవడంతో సచివాలయంలో సందర్శకుల రద్దీ లేకుండా పోయింది. పైరవీకారులు మాత్రం మంత్రులు, అధికారులు ఇళ్ల వద్దనే గుట్టుగా పనులు లాగించేస్తున్నారు.



## తెదేపా కార్యాలయంలో 'జగన్ సెల్'

హైదరాబాదులోని తెలుగుదేశం కార్యాలయంలో వైఎస్.జగన్ పేరిట ఓ కొత్త సెల్‌ను ప్రారంభించారు. వైఎస్ కాలంలో జరిగిన కుంభకోణాలు, వైఎస్.జగన్ ఆస్తిపాస్తుల వివరాల్ని సేకరించడం ఈ సెల్ పని. ఇప్పటికే బెంగుళూరులోని జగన్ నివాసం తాలూకు వివరాల్ని, ఫోటోల్ని సేకరించి పత్రికలకు విడుదల చేశారు. అలాగే వైఎస్ కుటుంబసభ్యుల పేర వున్న భూముల్ని, ఆస్తుల్ని, షేర్లను సేకరించే కార్యక్రమంలో ఈ సెల్ తలమునకలై వుంది. కేవలం పత్రికలు, ఎలక్ట్రానిక్ మీడియాకే కాకుండా కాంగ్రెస్ అధిష్టానానికి కూడా జగన్ సమాచారాన్ని పంపిస్తున్నారు. ఇటీవలకాలంలో చంద్రబాబును లక్ష్యంగా చేసుకొని జగన్ విమర్శించడాన్ని తెలుగుదేశం పార్టీ సీరియస్‌గా తీసుకున్నది. ఇందులో భాగంగానే 'జగన్ సెల్'ను ఏర్పాటు చేసి వైఎస్ హయాంలోని అక్రమాల్ని ఆయన కుటుంబసభ్యుల ఆస్తుల్ని తవ్వితీస్తున్నారు.

## రోశయ్య సేవలో ఆనం బ్రదర్స్!




ముఖ్యమంత్రి రోశయ్యను ప్రసన్నం చేసుకోడానికి ఆనం బ్రదర్స్ తెగ యాతన పడుతున్నారు. జగన్ నెల్లూరు జిల్లా ఓదార్పు యాత్రను అవకాశంగా తీసుకొని రోశయ్య వద్ద మార్కులు కొట్టేయడానికి వివేకా, రామనారాయణరెడ్డి చేస్తున్న ప్రయత్నాలు నవ్వు తెప్పిస్తున్నాయి. నెల్లూరులో జగన్ వర్గీయులు తలపెట్టిన వైఎస్ విగ్రహస్థాపనను అడ్డుకోవడానికి తాము చేస్తున్న కృషిని ఆనం బ్రదర్స్ స్వయంగా రోశయ్యను కలిసి వివరించారు. ఇతర జిల్లాల్లో ఎవరూ తమలాగ వ్యతిరేకించిన దాఖలాలు లేవంటూ రోశయ్య దగ్గర హీరోయిజం ప్రదర్శించారట. అయితే రోశయ్య మాత్రం యిందుకు సుముఖంగా లేనట్లు భోగట్టా. వై.ఎస్ విగ్రహస్థాపనను వ్యతిరేకిస్తే ప్రజల్లో వ్యతిరేకత రాదా! అంటూ రోశయ్య ప్రశ్నించగా ఆనం బ్రదర్స్ తెల్లమొహం పెట్టారట.

## దివాకర్ 'కల' నెరవేరేనా!



'మంత్రి' కావాలన్న జెసి.దివాకర్‌రెడ్డి కలనెరవేరుతుందో లేదో తెలీదు కానీ... ఆయన నోట్లో మాత్రం ఎప్పుడూ మంత్రివర్గ విస్తరణ గురించిన కబుర్లే నానుతున్నాయి. రాష్ట్రంలో నెలకొన్న రాజకీయ అనిశ్చితి తొలగాలంటే మంత్రివర్గ విస్తరణ ఒక్కటే మార్గమని దివాకర్ కనబడిన వారందరికీ చెబుతున్నాడు. వైఎస్ లేకపోయినా ఆయన మంత్రివర్గం నేటికీ కొనసాగుతోందని ఆయన అంటున్నాడు. రోశయ్య వెంటనే మంత్రివర్గాన్ని మార్చుకుంటే తప్ప ప్రస్తుత సమస్యలకు పరిష్కారం దొరకదన్నది ఆయన అభిప్రాయం. ప్రస్తుతం క్యాబినెట్‌లో 34 మంది వున్నారని, మరో 10 బెర్తుల్ని భర్తీ చేసుకోవచ్చని దివాకర్ గుర్తు చేస్తున్నాడు. క్యాబినెట్‌పై రోశయ్య సొంత ముద్ర లేకపోతే పరిపాలనపై పట్టు దొరకదని దివాకర్ చెబుతున్నాడు. క్యాబినెట్‌లో మార్పులు జరిగితే తనకు బెర్తు ఖాయం అన్న విషయాన్ని అన్యాపదేశంగా చెబుతున్నాడా దివాకర్?

## రవీంద్ర భారతం



ఎమ్మెల్యే, మాజీ మంత్రి డిఎల్.రవీంద్రరెడ్డి వైఎస్ వర్గీయులపై ఒంటికాలితో లేస్తున్నాడు. వైఎస్ ముఖ్యమంత్రిగా వున్నప్పుడు రవీంద్రను పక్కనబెట్టాడు. ప్రస్తుతం రవీంద్రరెడ్డి వైఎస్ జగన్‌ను టార్గెట్‌గా చేసుకొని విమర్శలు చేస్తున్నాడు. వైఎస్ హయాంలో జరిగిన అవినీతి భాగోతాన్ని తవ్వి తీసే పనిలో యమ బిజీగా వున్నాడు. రోశయ్య మంత్రివర్గాన్ని విస్తరిస్తే కడపజిల్లా నుంచి తనకు ఛాన్సు తప్పదన్న ధీమా రవీంద్రలో కనిపిస్తోంది. రాష్ట్రంలో నెలకొన్న రాజకీయ సంక్షోభంలో జగన్‌ను వ్యతిరేకిస్తే రోశయ్య క్యాబినెట్‌లో బెర్త్ ఖాయమన్న ప్రచారం రవీంద్రకు బాగా ఒంటబట్టిందంటూ వైఎస్ వర్గీయులు ఎదురుదాడికి దిగుతున్నారు. అయినా రవీంద్ర మాత్రం వైఎస్ చిట్టావిప్పే కార్యక్రమంలో తలమునకలై వున్నాడు. పాపం వ్రతం చెడ్డా మంత్రి పదవైనా దక్కుతుందో లేదో వేచిచూడాల్సిందే నంటూ సిఎల్‌పిలో ఎమ్మెల్యేలు చెవులు కొరుక్కుంటున్నారు.

## దినేష్ అలక



డిజిపి పోస్టుపై చివరిదాకా ఆశలు పెట్టుకున్న దినేష్‌రెడ్డి ప్రస్తుతం సిఎం రోశయ్యపై అలక వహించి వున్నాడు. ప్రస్తుతం విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టర్ జనరల్‌గా వున్న దినేష్ ఎప్పటి నుంచో డిజిపి పోస్టుపై కన్నేసి వున్నాడు. అయితే పనితీరు, కులసమీకరణలు, సర్వీస్ రికార్డు, సమర్థత ప్రాతిపదికన చివరకు అరవిందరావుకు డిజిపి పోస్టు దక్కింది. డిజిపి పోస్టుకు అభ్యర్థిని ఎంపిక చేయడానికి ఏర్పాటైన త్రిసభ్య కమిటీ తర్జన భర్జన పడ్డాక నిర్ణయాన్ని సిఎంకే వదిలేశారట. సిఎం ఢిల్లీని సంప్రదించి చివరకు అరవిందరావు వైపుకే మొగ్గు చూపడంతో త్రిసభ్య కమిటీ కూడా 'మమ' అంది. దీంతో అరవిందరావు డిజిపి అయ్యాడు. వై.ఎస్ గనుక అధికారంలో వుండి వుంటే తనకే డిజిపి పోస్టు దక్కివుండేదంటూ దినేష్ సన్నిహితుల వద్ద వాపోతున్నాడట. ప్చ్! ఏంచేద్దాం! ఈసారికి యిలా కానిచ్చేశాడు రోశయ్య.

## సిఎంపై ఒత్తిడి పెరిగిందా!



ముఖ్యమంత్రి రోశయ్యపై ఒత్తిడి పెరిగిందా! ఔననే అంటున్నారు వైద్యులు. ఎనిమిది పదుల వయసు దాటిన రోశయ్య గత యేడాదిగా ఒత్తిడికి లోనవుతున్నారు. వైఎస్ హఠాన్మరణంతో ముఖ్యమంత్రి బాధ్యతలు స్వీకరించిన రోశయ్యకు అన్ని కష్టాలే ఎదురవుతున్నాయి. అటు రాజకీయంగా, ఇటు ఆర్థికంగా రాష్ట్రం అతలాకుతలమవుతోంది. వీటికి తోడు ప్రకృతి వైపరీత్యాలు, అధిక వర్షాలు, వరదలు రాష్ట్రాన్ని కుదిపేస్తున్నాయి. రాష్ట్ర రాజకీయ చరిత్రలో బహుశా ఏ ముఖ్యమంత్రి ఎదుర్కోని సమస్యల్ని రోశయ్య ఎదుర్కోవాల్సి వస్తోంది. ఇప్పటికే బైపాస్ కూడా చేయించుకున్న రోశయ్యకు వయసు మీద పడడం, ఒత్తిడి తరచూ అనారోగ్యానికి గురి చేస్తున్నాయి. గతవారంలో ఢిల్లీకి వెళ్లి అధినేత్రి సోనియాను కలవాల్సి వుండింది. ఆరోగ్యం సహకరించకపోవడంతో ఢిల్లీ పర్యటన రద్దయింది. గతవారం చిత్తూరు జిల్లా మన్నవరంలో పవర్ ప్రాజెక్ట్ శంకుస్థాపన కార్యక్రమంలో ప్రధానితోపాటు హాజరు కావాల్సి వున్నా... తీవ్ర జ్వరంతో అది కూడా రద్దయింది. ఒత్తిడి తగ్గించుకోమని డాక్టర్లు సలహా యిస్తున్నారు. అయితే పరిస్థితులు మాత్రం రోశయ్యను ఒత్తిడికి గురి చేస్తూనే వున్నాయి.

ఈ మాసంలోనే

# రెండు మతాల ముఖ్యపండుగలు రంజాన్, వినాయక చవితి!

ఈయేడు భాద్రపద మాసం రెండు మతాలకు సంబంధించిన ముఖ్యమైన పండుగలకు నెలవయ్యింది. అవి ముస్లింలు పరమ పవిత్రమైనదిగా, దివ్యఖురాన్ అవతరించిన మాసం రంజాన్ కాగా, హిందువులకు ఆరాధ్యదైవం సకల శుభాలకు, సర్వ కర్మలకు గణనాధుడైన విఘ్నేశ్వరుడు పుట్టిన తిథి వినాయకచవితి పండుగ. ఈ రెండు పండుగలు సెప్టెంబర్ 10, 11 తేదీల్లో వస్తుండడంతో ఇరు మతాలకు చెందిన వారు భక్తి ప్రపత్తులతో పండుగలను జరుపుకోనున్నారు.



ముస్లింల ఏకేశ్వరాలయం మక్కాలోని కాబా వద్ద భక్తజన సందోహం.

ముస్లింలకు పవిత్రమైన మాసం రంజాన్ మాసం. సకల శుభాలను ప్రసాదించే ఈ మాసాన్ని కారుణ్యపు మాసం అని కూడా అంటారు. దీనిని సత్కార్యాల వసంత కాలం అనీ చెప్తారు. కఠిన ఉపవాసాలు వుండి నమాజు చేసే ఈ నెలకు మరో ప్రత్యేకత వుంది. ముస్లింలకు మార్గదర్శకంగా చెప్పబడే దివ్య ఖురాన్ అవతరించింది ఈ మాసంలోనే. ఎంతో శుభప్రదమైనదిగా భావించే ఈ రంజాన్ మాసంలో ధర్మ నిష్ఠ, ఆత్మపరిశీలనతో ఉపవాసం వుండిన వారికి వారి వారి పాపాలను అల్లా తొలగిస్తాడని నరకప్రాప్తి పోయి స్వర్గప్రాప్తి లభిస్తుందని ముస్లింల ప్రగాఢ విశ్వాసం. రంజాన్ ఉపవాసాల కాలంలో ఉషోదయానికి ముందు నుంచి సూర్యాస్తమయం వరకు అన్నపానీయాలు మాని, కోపాన్ని, కోర్కెలను అణచుకొని నియమనిష్ఠలతో ఉపవాస దీక్షలు కొనసాగిస్తారు. అందుకే రంజాన్ మాసంలో ప్రతి గడియా, ప్రతి గంట, ప్రతి క్షణం శుభప్రదమైనదిగా, పుణ్యవంతమైనదిగా భావిస్తారు. వేయి నెలల రాత్రులకంటే మేలైన రాత్రిగా, రంజాన్‌కు ముందు 27వ ఉపవాసంలో ముందురోజు వచ్చే రాత్రికి, జాగరణచేసే రాత్రికి విశిష్టత వుంది. ఈ మాసంలో వచ్చే మొదటి పది రోజులను కారుణ్య దినాలుగా, నడుమ వచ్చే పది రోజులను క్షమాపణ రోజులుగా, చివరి పది రోజులను నరక విమోచన రోజులుగా చెప్పబడతాయి.



ఏ శుభకార్యం చేపట్టాలన్నా, ఏ వ్రతం ఆచరించాలన్నా ముందుగా గణనాధుని పూజించడం ఆనవాయితీ. విఘ్నాలకు అధిపతి అయిన వినాయకుని పూజించినట్లయితే అన్ని ఆటంకాలు తొలగి సకల శుభాలు కల్గుతాయి. అలాంటి విఘ్నేశ్వరుడు భాద్రపద శుద్ధ చతుర్థిరోజున జన్మించడమే కాక పరమేశ్వరుడి నుంచి విఘ్నాధిపత్యం పొందిన రోజు. అందుకే ఆనాడు అన్ని ప్రాంతాలలోను వినాయక చవితిని ఘనంగా జరుపుకొంటారు. చవితినాడు ఉదయాన్నే ఇంటిని శుభ్రం చేసుకొని మామిడి ఆకుల తోరణాలు కట్టుకొని, పరిశుభ్రమైన పీటపై వినాయక విగ్రహాన్ని వుంచాలి. వినాయకుడికి ఉండ్రాళ్ళు చాలా ఇష్టం. కాబట్టి మిగిలిన భక్ష్యాలున్నా లేకున్నా వీటిని తప్పని సరిగా తయారుచేసి నైవేద్యంగా పెడతారు. పూజకు పూలు, పండ్లతోపాటు మాచిపత్రి, మారేడు, గరిక, ఉమ్మెత్త, రేగు, ఉత్తరేణి, మామిడి, జిల్లేడు తదితర 21రకాల పత్రాలతో ఆరాధించినట్లయితే విద్య, విజయం, సంతానం, సకల ఐశ్వర్యాలు, సుఖసంతోషాలు లభిస్తాయని పురాణ కథనం. చతుర్థినాడు చంద్రుని చూసినట్లయితే నీలాప నిందలు కల్గుతాయి కాబట్టి చంద్రుని చూడకుండా జాగ్రత్తలు తీసుకోమంటారు పెద్దలు. విఘ్నాలకు అధిపతి అయిన విఘ్నేశ్వరుడిని

*శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్*
*ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే*

అని స్మరించినట్లయితే ఎలాంటి ఆటంకాలు వుండక అన్నీ శుభాలే కల్గుతాయని పండితుల ఉవాచ.

## ట్రంకురోడ్డు కబుర్లు

### మైనార్టీల నెత్తిన టోపీ!

మళ్ళీ ఓటుకోసం వచ్చినపుడు చెప్తా..

నెల్లూరు నగరంలో ముస్లిం మైనార్టీల సంఖ్య ఎక్కువ. అన్ని రాజకీయ పార్టీలు ఎన్నికల సందర్భంలో వీరిని రకరకాలుగా ఊరించి కరివేపాకులా వాడు కొంటుంటాయి. పవిత్ర రంజాన్ మాసాన్ని పురస్కరించుకొని ఇటు మంత్రి రామనారాయణరెడ్డి గాని ఆయన అన్న వివేకానందరెడ్డి గాని, మొన్నటి ఎన్నికల్లో నెల్లూరు నగరంలో మైనార్టీల ఓట్ల వల్ల నెగ్గిన ప్రజారాజ్యం పార్టీ ఎమ్మెల్యే అయిన శ్రీధర్‌కృష్ణారెడ్డిలలో ఎవరికీ ఇఫ్తార్ విందు ఇచ్చే తీరిక లేకుండా పోయింది. పండుగరోజు ఈద్గాకు వచ్చి మాటలు చేష్టలతో మైనార్టీలపై కపట ప్రేమ చూపే రాజకీయ పార్టీల నాయకుల అసలు స్వరూపం 'ఇఫ్తార్ విందు'తో బయటపడిందనవచ్చు.

### వేచి చూడలేమన్న మహిళలు!

సాధారణంగా రాజకీయ పార్టీల సభలు, సమావేశాలకు మహిళలు తీసుకొని వస్తుంటారు. వీళ్ల కార్యక్రమం పూర్తయ్యే వరకు వుంటారు. దీనికిగాను వారి మంచి చెడ్డలను కార్యక్రమ నిర్వాహకులు చూస్తారు. 2తేది నెల్లూరు కస్తూరిబా కళాక్షేత్రంలో ప్రభుత్వం జరిపిన దివంగత వైఎస్ వర్థంతి సభకు మహిళలను తీసుకొచ్చారు. కలెక్టర్, ఇతర జిల్లా అధికారులు ప్రకటించిన సమయానికి ఈ కార్యక్రమానికి హాజరైనా రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాత్రం రాలేదు. దీంతో సభను మొదలుపెట్టను అధికారులు సంశయంలో పడ్డారు. ఇంతలో సభలోని మహిళలు వేచి చూడలేమని ఒక్కసారిగా లేచారు. అధికారులు కాళ్లావేళ్లాపడి వారిని అతికష్టం మీద ఓ అరగంట వుండేటట్లు చేయను నానా తిప్పలు పడడం చూసేవారిని విస్తుపోయేలా చేసింది.

### అబ్బే... అంతలేదు!



నెల్లూరు నగరంలో వరుసగా జరుగుతున్న దొంగతనాలు అరికట్టడంలో పోలీసులు పూర్తిగా విఫలమయ్యారు. పైపెచ్చు దొంగతనం జరిగిన మొత్తాన్ని బాధితులు బయటకు చెప్పను ఒప్పుకోవడం లేదు. 3తేది రాత్రి గిడ్డంగివీధిలో అంతర్జాతీయ వెయిట్ లిఫ్టర్ తులసి ఇంట్లో దొంగలు పడ్డారు. తులసి తండ్రి కృష్ణమాచారి ఇంట్లోనే నగలు చేసి వాటిని తిరుచానూరుకు తీసుకెళ్లి అమ్ముకొస్తారు. ఆయన నగరంలో లేకపోవడం, కామన్ వెల్త్ క్రీడల శిక్షణ నేపథ్యంలో తులసి కూడా ఇంట్లో లేదు. దొంగలు బంగారు ఆభరణాలు, వజ్రాలు, పచ్చలు, కెంపులు పట్టుకెళ్లారు. వీటి విలువ లక్షల్లో వుంటుందని తులసి చెల్లెలు మీడియాకు చెప్పబోతే నగర డిఎస్పీ రాధిక అడ్డుకొన్నారు. అబ్బే అంత వుండదని కవర్ చేశారు. వెయిట్ లిఫ్టింగ్‌లో తులసి సాధించిన బంగారు పతకాన్ని కూడా దొంగలు పట్టుకెళ్లారు. పోలీసులు ఈ దొంగతనంలో సొత్తు రికవరీ చేయలేకపోయినా దేశం కోసం తులసి కష్టపడి సాధించిన బంగారు పతకాన్ని పట్టుకోవాల్సిన బాధ్యత ఎంతైనా వుంది.

### అయ్యో పాపం సిఎం!

గత ఏడాదిగా రాష్ట్రంలో ఎన్నో విపత్కర పరిస్థితులు ఏర్పడ్డా సిఎం రోశయ్య తనదైన శైలిలో పరిపాలన సాగించారు. ఆయన పాలన ఏడాది పూర్తయిన సందర్భంగా నెల్లూరులో ఇటు డిసిసి గానీ, మంత్రితోపాటు ఎమ్మెల్యేలు గానీ చిన్న కార్యక్రమం చేపట్టలేదు. కానీ వీటన్నింటిని పట్టించుకోకుండా రోశయ్య స్వకులస్తులు స్టోన్‌హౌస్‌పేటలోని కులదేవత కన్యకాపరమేశ్వరి ఆలయంలో రోశయ్య ఆయన సతీమణి శివలక్ష్మి గోత్రనామాలతో ప్రత్యేక పూజలు చేయించారు. రాష్ట్రంలో వరదలు సంభవిచ్చినప్పుడు రోశయ్య నిద్రాహారాలు మాని గొప్పగా పనిచేశారని, వైఎస్ ప్రారంభించిన పథకాలను ఆయన కాబట్టి నెట్టుకొస్తున్నారని, సోనియాగాంధీకి విధేయునిగా వుంటూ రాష్ట్రాన్ని ప్రగతిపథంలో తీసుకవెళ్తున్నారని ఆర్యవైశ్య నేతలు రోశయ్య సేవలను బహుదా ప్రశంసించారు. పాపం... సిఎం రోశయ్య చివరకు ఒక కుల నాయకునిగా మిగిలిపోవడం కన్నా బాధాకరమైన విషయం ఇంకొకటి లేదని ట్రంకురోడ్డులో వాడివేడి చర్చలు జరుగుతున్నాయి.

### రాజకీయ కొత్త బిచ్చగాడు

మరి మన డ్రామాలకు ఎవరిస్తారు డబ్బులు..!

కొత్త బిచ్చగాడు పొద్దెరగడన్న చందంగా వుంది నెల్లూరు బాలాజీనగర్ ప్రాంత కాంగ్రెస్ నాయకుడు కర్తం ప్రతాప్‌రెడ్డి పరిస్థితి. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి అనుంగు శిష్యుడిగా వుంటున్న ప్రతాప్‌ను అందరికంటే ముందు రాబోయే కార్పొరేషన్ ఎన్నికల్లో ఈ ప్రాంత కార్పొరేటర్ అభ్యర్థిగా ప్రకటించి అందర్నీ ఆశ్చర్యపరిచారాయన. దీనికి వుబ్బితబ్బిబ్బైన ప్రతాప్‌రెడ్డి వివేకా కళ్లలో ఆనందం చూడను నానా హంగామా చేస్తున్నాడు. వివేకాను అభివృద్ధి నిరోధకుడని విమర్శించిన తెలుగుదేశం పార్టీకి వ్యతిరేకంగా శుక్రవారం స్కూటర్ ర్యాలీని చేపట్టిన ప్రతాప్‌రెడ్డి పబ్లిసిటీ కోసం వాళ్ళ (టిడిపి) డ్రామాలు ఆడదలిస్తే ఫ్లెక్స్ బోర్డులు పెట్టుకోను డబ్బులిస్తానని ప్రకటించారు. ప్రతి పక్షీయుల ప్రచారానికి నిధులిస్తానని ప్రకటించిన కర్తంను చూసి రాజకీయ కొత్తబిక్షగాడని వ్యాఖ్యానిస్తున్నారు.




నిరుపయోగమైన పనులలో తలమునకలవుతారు. తోటి వారిలో అమర్యాద ప్రాప్తి, వృథా వాదోపవాదాలు చోటు చేసుకొంటాయి. వాహన ప్రమాదావకాశాలు జాగ్రత్త. వ్యాపారులకు సామాన్యంగా ఉంటుంది. నిరంతర పరిశ్రమతో పనులు నిర్వహిస్తారు. ఆర్థిక లావాదేవీలు సత్ఫలితాల్నిస్తాయి. దైవ, పుణ్యకార్యాల వైపు మనసు పోనిస్తారు. ఆదాయం తృప్తికరంగా ఉంటుంది.




సుఖసంతోషాలకు కొదువ ఉండదు. ఆస్తి సమకూర్చుకొనే ప్రయత్నాలు చేస్తారు. పలుకుబడి పెరుగుతుంది. ఎదురుచూసిన తావులో ధనప్రాప్తి. వృత్తిలో అమోఘం. కళాకారులకు మేలు. శుభ కార్యాచరణ. సత్సంగమం. దూరాలోచనతో స్థిరధనాదాయాలకు ప్రణాళికలు సిద్ధం చేస్తారు. ముఖ్య నిర్ణయాలు తీసుకొంటారు. బంధుమిత్రులు సహాయ సహకారాలు అందిస్తారు.




ఆర్థిక సమస్యలు ఎదురవుతాయి. మాట నిలుపుకోలేరు. కాని తృప్తికరంగా కాలం గడస్తుంది. నోరు పారేసుకోవద్దు. ప్రశాంతంగా కాలం గడపడం మంచిది. వ్యాపారులకు మంచి లాభావకాశాలు. సంఘంలో గౌరవ మర్యాదలు పెరుగుతాయి. వృత్తి, ఉద్యోగాలలో ఎదురు చూసిన లాభాలనందుకొంటారు. విందులు, వినోదాలలో పాల్గొంటారు. దూరదేశప్రయాణావకాశాల సూచన.




శ్రమాధిక్యత, ఆరోగ్య భంగము. ఎదురు చూసిన డబ్బు చేతి కందుతుంది. ప్రయాణాలు సత్ఫలితాన్నిస్తాయి. దైవకార్యాలలో పాలు పంచుకొంటారు. విందులు, వినోదాలతో కాలం గడపుతారు. రోగ నివృత్తి ద్వారా సుఖసంతోషాలు. ఉద్యోగంలో మార్పు గూర్చి ఆలోచిస్తారు. రావలసిన బాకీలు వసూలవుతాయి. వృత్తి, వ్యాపారాలలో వచ్చే సదవకాశాలను జారవిడుచుకోకండి.




ఆవేదనకు గురి అవుతారు. సమాజకార్యక్రమాలలో బాధ్యత పెరుగుతుంది. సుఖం కొరవడుతుంది. అనుకోని వ్యయ సూచనలు. వృత్తిలో శ్రమానంతర లాభాలు. బంధుమిత్రుల వల్ల లాభాలు. సమాజంలో గౌరవమర్యాదలు పెరుగుతాయి. మృదుభాషణతో పనులు సాధించుకొంటారు. సంతానమూలంగా లాభాలు. విశ్రాంతి రాహిత్యం. అలసట, చిరాకు పనుల్లో ఆటంకాలు ఉంటాయి.




ఆర్థిక లావాదేవీలు సత్ఫలితాన్నిస్తాయి. ప్రయోజనవంతమైన పనులలో మనసు పోనిస్తారు. శుభవార్తాశ్రవణం ఉంటుంది. జీర్ణకోశ బాధలుంటాయి. అప్పుల సమస్యలు తీరే ప్రయత్నాలు చేస్తారు. మనశ్శాంతి చక్కగా ఉంటుంది. శుభకార్యాల్లో పాల్గొంటారు. దూరాహ్వానాలు లాభాల్నిస్తాయి. భూసంపదను పెంచుకొనే యోచన చేస్తారు. నూతన గృహోపకరణాలు కొంటారు.

## వారఫలాలు

*తేది 11-09-2010 నుండి 17-09-2010 వరకు సింహ, కన్యల్లో రవి; సింహంలో బుధుడు; మీనంలో గురువు; కన్యలో శని; తులలో శుక్రుడు, కుజుడు; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; తుల, వృశ్చిక, ధనుస్సుల్లో చంద్రుడు సంచరిస్తారు.*

### పంచాంగం

11తేది వినాయక చవితి పండుగ.

**శుభ ముహూర్తాలు లేవు**

**సెప్టెంబర్ తిథులు**
**భాద్రపద శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 11 | శని | చవితి | రా.2.26 | గం.ల.వ |
| 12 | ఆది | పంచమి | రా.12.28 | గం.ల.వ |
| 13 | సోమ | షష్ఠి | రా.11.19 | గం.ల.వ |
| 14 | మంగళ | సప్తమి | రా.11.02 | గం.ల.వ |
| 15 | బుధ | అష్టమి | రా.11.34 | గం.ల.వ |
| 16 | గురు | నవమి | రా.12.50 | గం.ల.వ |
| 17 | శుక్ర | దశమి | రా.2.41 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




మంచి విజయ ప్రాప్తి. అనుకొన్నవి అనుకొన్న రీతిలో సాధించుకొంటారు. విరోధులు అణిగి ఉంటారు. వృత్తిలో మంచి అవకాశాలు. ధన వ్యయం. వృత్తిలో అవకాశాలు జార విడుచుకోవద్దు. ఊహలు నిజమయ్యే సమయం. బంధుమిత్ర వర్గంతో హాయిగా కాలక్షేపం చేస్తారు. సోదరులు, మిత్రులు చక్కగా సాయమందిస్తారు. వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధి చక్కగా ఉంటుంది.




ప్రతి పనిలో విజయ సాధన. ప్రభుత్వం నుండి లేదా పై అధికారుల నుండి శుభవార్తాశ్రవణం. మీ నిర్ణయాలకు తిరుగుండదు. వృత్తి ఉద్యోగాల్లో పురోభివృద్ధి కానవస్తుంది. ధనాదాయం తృప్తికరం. ఆత్మీయులు మిక్కిలిగా ప్రోత్సహిస్తారు. సమాజంలో పరపతి పెరుగుతుంది. మిత్రుల మూలంగా శుభవార్తాశ్రవణం. వివాహాది శుభకార్యాలకు ప్రేరేపణ జరుగుతుంది.




మనస్పర్థలు, వృథావాదోపవాదాలు. పొత్తికడుపునకు సంబంధించిన అనారోగ్య బాధ. ప్రయాణాలలో నష్టం. వైద్య ఖర్చులు. దైవచింతనలో మనసు పోనివ్వాలి. ప్రతిపని దీర్ఘంగా ఆలోచించి చేయాలి. నష్టావకాశాలు. ముందు చూపు అవసరం. వారం మధ్యలో నూతన వృత్తి, వ్యాపారాలకు సంబంధించి పునాదులు వేస్తారు. కుటుంబంలో సుఖశాంతులు నెలకొంటాయి.




ఉన్నతాధికారుల నుండి సన్మాన ప్రాప్తి. మీ పలుకుబడి పెరిగే రోజు. ఇరుగుపొరుగువారు మీ మాటలకు విలువ నిస్తారు. ఆరోగ్యం చక్కగా ఉంటుంది. తృప్తికరమైన ఖర్చులు అధికం. స్థానచలనం లేదా ఉనికి మార్పిడి గురించి చర్చిస్తారు. ఆత్మవిశ్వాసంతో అన్ని పనులు నిరాటంకంగా సాగించుకొంటారు. దూరప్రాంతాల్లో ఉన్న ఇష్టులను కలుసుకొంటారు.




ఇతరులపై మీదే పైచేయి. దూరం నుండి శుభవార్తాశ్రవణం. అప్పులు తీరుస్తారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో మంచి ఆదాయం. వినోదాలతో కాలక్షేపం చేస్తారు. పనులు చక్కగా పథకం ప్రకారం నిర్వహిస్తారు. ప్రియ వార్తాశ్రవణం. మిత్రుల వల్ల సాయమందుతుంది. కళత్ర సుఖం చక్కగా ఉంటుంది. ధనాదాయం బాగుంటుంది. పథకాలు ప్రయోజనవంతమయ్యే కాలం.




ధనవిషయాలలో ఆదుర్దా. నష్ట ప్రాప్తి. సంతానమూలంగా కొంత శాంతి. సమస్యలున్నా సర్దుబాటు అవుతాయి. ఇతరులతో మాటపట్టింపు పనికి రాదు. వ్యాపారులకు లాభావకాశాలు. నిలచి నిదానంగా ఆలోచించి పనులు నిర్వహించాలి. మిత్రుల తోడ్పాటు లభిస్తుంది. పొదుపు గురించి చింతిస్తారు. వృత్తిలో ముందంజ వేస్తారు. ఉత్సాహంతో దూకుడుగా పనులు సాగిస్తారు.

# నిషిద్ధ స్థలాలు అవాస్తు దుష్ప్రభావాల 'కాటకాలు'!

*కె.వి.ఇందిరారమణ — తిరుపతి*

** ఇంటి నిర్మాణానికి ఎటువంటివి నిషిద్ధ స్థలాలు అవుతాయి?*

చతురస్ర(సమతల), దీర్ఘచతురస్ర(సమాంతర) స్థలాలు తప్ప మిగిలినవన్నీ కూడా గృహ నిర్మాణానికి 'నిషిద్ధ' స్థలాలు.

*వై.వి.అంజలీదేవి — గూడూరు*

** నైరుతి బ్లాకు స్థలం, పశ్చిమ వైపు నిర్మాణం చేయవచ్చా?*

ఇళ్లన్నీ పశ్చిమం వైపే వున్నాయి. అయితే మీకు దక్షిణం కుజస్థానం స్త్రీ స్థానం ఉత్తమం. అయినా చేయలేరు. పశ్చిమం శనిస్థానం నపుంసక స్థానం గనుక మీకు నైరుతి బ్లాకు పనికిరాదు.

*ప్రచారం దామోదర్ — ఉదయగిరి*

** నేను తూర్పు గృహ నిర్మాణం చేస్తున్నాను. దక్షిణం ఖాళీ స్థలం వున్నది.*

తూర్పు గృహ నిర్మాణానికి ముందు దక్షిణ స్థలంలో ప్రహరీ, నైరుతి గది నిర్మాణం జరిగాక, తూర్పు గృహ నిర్మాణాన్ని ప్రారంభించాలి. లేకపోతే తూర్పు నిర్మాణం చాలా ఆలస్యమవుతుంది.

*వి.ఎన్.భార్గవి — తడ*

** వంట నైరుతి గదిలో వచ్చింది. ఆకస్మిక సమస్యలెక్కువయ్యాయి.*

ప్లాను చూశాను. వంట వాయువ్యానికి మార్చి, డైనింగ్ టేబుల్‌ని నైరుతి వైపు ఏర్పాటు చేసుకోండి. 'వాస్తు యంత్ర' ప్రతిష్ట వల్ల బాబు ఆరోగ్యం బాగుపడుతుంది.

*కె.పావనీరెడ్డి — ఉదయగిరి*

** పాప ఆరోగ్యం కుదుట పడింది. మీకు నిజంగా ఋణపడి వున్నాం.*

చెప్పినవి నమ్మకంగా చేసుకున్నారు. పూజా విధానం ఎంతో మేలు చేస్తుంది.

*పేర్నేని ప్రతిభారెడ్డి — బెంగుళూరు*

** ఆర్థికం, అనారోగ్యం సమస్యలెక్కువ. ప్లాను, జాతకం పంపిస్తున్నాను.*

ఇంటి 'వ్యూ' ఫోటో పంపి మంచి పని చేశారు. తొమ్మిది వాస్తు దోషాలున్నాయి. వాటిని సరిచేసుకోండి.

*ఎం.వసుమతీ భాస్కర్ — వింజమూరు*

** నా పుట్టిన తేదీ, సమయం, ఇంటి ప్లాను పంపిస్తున్నాను. సమాధానం చెప్పండి.*

మీ రాశి తుల. శుక్రుడు అధిపతి. మీ స్థలం ఆగ్నేయం బ్లాకు. దక్షిణం కుజస్థానం స్త్రీ స్థానం. తూర్పు రవి స్థానం పురుష స్థానమైనప్పటికీ బ్లాకు స్థలాలు మీకు కలసిరావు. గృహాన్ని అమ్మివేయండి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*షేక్ షానవాజ్‌బేగం — హైదరాబాద్*

** యంత్ర ప్రతిష్ట తర్వాత చాలా సమస్యలు పరిష్కరింపబడ్డాయి.*

మంత్ర బీజాక్షరాల శక్తి, మీ నమ్మకానికున్న బలం మీ కుటుంబానికి మేలు చేశాయి. 'అల్లా'కు ధన్యవాదాలు చెప్పండి.

*వి.అనురాధారెడ్డి — నెల్లూరు*

** ఒక అపార్టుమెంటు తూర్పుకు నేరుగా కాకుండా స్థలం వల్ల 'క్రాస్'గా కడుతున్నారు.*

మూలలు చేసే ఇళ్లయినా, అపార్టుమెంట్లయినా 'కోణవేధ'కు గురౌతాయి. బ్లాకు స్థలాలు ఎంత హానికరమో అవి అంతకంటే చెడు ఫలితాల నిస్తాయి.

*చిల్లకూరు వెంకురెడ్డి — కోట*

** పశువులొక్కొక్కటిగా చనిపోయాయి. పంట దిగుబడి కూడా బాగా తగ్గింది.*

పశువులశాల 'వాయువ్యం'లో ఉత్తరం గోడకు తగులకుండా ఏర్పాటుచేయాలి. వీధి దృష్టి, కోణవేధ వల్ల ఇలా జరిగింది. వాస్తు సరిచేసుకోండి.

*ఎ.వి.దినేష్‌రెడ్డి — గూడూరు*

** 'చైనా' వాస్తును పాటిస్తున్నాను. ఫలితాలేమీ కనిపించలేదు.*

'ఇండియన్' వాస్తును పాటించి చూడండి. ఫలితాలు కనిపిస్తాయి.

# ఐదవ నెంబర్ జాతీయ రహదారిని ఆరులైన్లు చేస్తున్నారు!

**జిల్లాలోని కావలి నుంచి తడ వరకు సాగే ఐదవ నెంబర్ జాతీయ రహదారిని ప్రస్తుతమున్న నాలుగు లైన్ల నుంచి ఆరు లైన్లకు విస్తరించేందుకు కేంద్ర ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. దీనికి అవసరమైన చర్యలు చేపట్టమని జిల్లా యంత్రాంగాన్ని ఆదేశించింది.**

నెల్లూరు జిల్లా పరిధిలోని ఐదవ నెంబరు జాతీయరహదారి ఆరు లైన్లుగా అభివృద్ధి చెందనుంది. గత ఎన్డీఏ ప్రభుత్వ హయాంలో ప్రపంచబ్యాంకు నిధులతో నాలుగులైన్ల జాతీయ రహదారిని ఏర్పాటు చేయడం జరిగింది. భవిష్యత్ అవసరాలను దృష్టిలో వుంచుకొని ప్రస్తుతం వున్న నాలుగులైన్ల రహదారిని ఆరు లైన్లుగా విస్తరించేందుకు కేంద్రప్రభుత్వం నిర్ణయించింది.

జిల్లా పరిధిలో కావలి నుంచి తడ వరకు రోడ్డు విస్తరణ జరగనుంది. ప్రస్తుతం వున్న నాలుగులైన్ల రహదారిలో ప్రమాదాలు ఎక్కువగా జరుగుతున్నాయి. భారీ వాహనాలు మరమ్మత్తులకు గురైన సమయంలో వాహనాలను రోడ్డుపైన నిలిపివేయడం కారణంగా తరచూ ప్రమాదాలు చోటు చేసుకుంటున్నాయి. ఈ ప్రమాదాలను నివారించాలన్న లక్ష్యంతో ఆరులైన్లుగా రహదారిని విస్తరించనున్నారు. ఈ మేరకు రహదారి నిర్మాణానికి అవసరమైన అన్ని చర్యలు చేపట్టాలని జిల్లా కేంద్రానికి ఉత్తర్వులు అందాయి.

రెవెన్యూ, రోడ్లు భవనాలశాఖ, అటవీశాఖ, ఆర్‌డబ్ల్యుఎస్, ఉద్యానవన, మునిసిపాల్టీ, విద్యుత్, బిఎస్ఎన్ఎల్ శాఖల అధికారులు వారి శాఖలకు సంబంధించిన పనుల్ని పూర్తి చేసేందుకు కసరత్తు చేస్తున్నారు. ఆరులైన్ల విస్తరణ పనుల్లో కావలి డివిజన్‌లో ఐదు మండలాల్లోని 16 గ్రామాల్లో సర్వే చేయాల్సి వుంటుంది. నిర్మాణాల విలువలను లెక్కించి ఈనెల 10తేది నాటికి పూర్తిస్థాయి నివేదిక అందజేయాల్సి వుంటుంది. గతంలో మాదిరిగా అవకతవకలకు తావులేకుండా ఈసారి అన్ని చర్యలు తీసుకుంటున్నారు.

నీటి పారుదలశాఖ పరంగా వచ్చే సాగునీటి చెరువుల అంచనాలను రూపొందించేందుకు ప్రత్యేక బృందాన్ని కూడా ఏర్పాటు చేశారు. ఈ బృందం జిల్లాలో జాతీయ రహదారికి ఆనుకొని వున్న చెరువులు, కల్వర్టులను అంచనా వేయనుంది. ఉద్యానవనశాఖ పరిధిలో వున్న పండ్ల తోటల అంచనాలు తయారు చేయడంతోపాటు లబ్దిదారులకు అవసరమైన నష్టపరిహారం చెల్లించేందుకు ప్రణాళికలు తయారు చేస్తున్నారు.

అటవీశాఖ పరంగా నిర్దేశించిన చట్టాల ప్రకారం భూ సేకరణలో కొన్ని ఇబ్బందులుతలెత్తే అవకాశం వుంది. ఈ శాఖకు చెందిన భూమిని సర్వే చేసే క్రమంలోనే నేషనల్ హైవే ఆథారిటీ ఆఫ్ ఇండియా అధికారుల సహకారం తీసుకోవాల్సి వుంటుంది. అలాగే రిజర్వుఫారెస్టు భూమి పరిధిలో అటవీయేతర భూములకు సంబంధించిన ప్రతిపాదనలు తయారు చేస్తారు. విద్యుత్‌శాఖ, బిఎస్ఎన్ఎల్ శాఖలు తమ పరిధిలోని విద్యుత్ స్థంభాలు, ట్రాన్స్‌ఫార్మర్లను ముందుగా గుర్తించి తొలగించాల్సి వుంటుంది. మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు చెత్త కుప్పలు, డ్రైనేజీ కాల్వలను తొలగించాల్సి వుంటుంది.

గొలగమూడి క్రాస్ రోడ్డు వద్ద వున్న భారత ఆహారసంస్థ గోడౌన్లను అక్కడ నుంచి వేరే ప్రదేశంలో ఏర్పాటు చేస్తారు. తడ సమీపంలో వున్న ఇంటిగ్రేటెడ్ చెక్‌పోస్టును కూడా వేరే ప్రదేశానికి తరలిస్తారు. ఇప్పటికే రెవెన్యూశాఖ జాతీయ రహదారి నిర్మాణానికి అవసరమైన భూమిని సేకరించే పనిలో నిమగ్నమై వుంది. యుద్ధప్రాతిపదికన ఆరు లైన్ల రహదారి పనులు చేపట్టాల్సి రావడం వలన మరి కొంతమంది సర్వేయర్లను నియమించారు.


విస్తరించనున్న ఐదవ నెంబర్ జాతీయ రహదారి.

జాతీయ రహదారి నిర్మాణంలో భూములు, ఇళ్లు కోల్పోతున్న వారికి పరిహారం చెల్లించడంలో నేషనల్ హైవే అథారిటీ ఆఫ్ ఇండియా అధికారులు ఈ దఫా ఎలా వ్యవహరన్నది ఆసక్తికరంగా మారింది.

**అవినీతి కథ**

## ● ములుమూడి బస్టాండ్‌లో

# ఇరిగేషన్ స్థలం దురాక్రమణ!

**నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి అండదండలతో ములుమూడి బస్టాండ్‌లో ఇరిగేషన్ స్థలాన్ని దర్జాగా ఆక్రమించి పక్కా భవనం కట్టినా అడిగే అధికారే లేడు.**

ప్రజాప్రతినిధుల ఉదాసీనత, అధికారుల అవినీతి, అక్రమాల కారణంగా ప్రభుత్వ స్థలాలు కబ్జాకు గురవుతున్నాయి. కోట్ల రూపాయల విలువచేసే స్థలాల్లో భూకబ్జాదారులు పక్కా భవనాలు అనతి కాలంలోనే నిర్మిస్తున్నా పట్టించుకునే నాధుడే లేకుండా పోయారు. అధికారపక్షం లేదా ప్రతిపక్ష పార్టీలకు చెందిన నేతల సహకారం వుంటే చాలు ఖాళీ స్థలంలో పక్కా భవనాలు నిర్మించేస్తున్నారు.

నగరంలోని మునిసిపల్ కార్పొరేషన్, నీటి పారుదల శాఖలకు చెందిన అనేక స్థలాలు ఆక్రమణలో వున్నాయి. ఖాళీ స్థలాలతోపాటు డ్రైనేజి కాల్వలు సైతం ఆక్రమణకు గురికావడంతో నగరంలో డ్రైనేజి వ్యవస్థ ప్రశ్నార్థకంగా మారింది. ప్రభుత్వ ఖాళీ స్థలంలో నివాసం వుండేందుకు పేద ప్రజలు చిన్నపాటి గుడిసె వేసుకుంటే ఆఘమేఘాల మీద వెళ్లి వాటిని తొలగిస్తుంటారు అధికారులు. భూకబ్జాదారులు ఆక్రమిస్తే మాత్రం వాటివైపు కన్నెత్తి కూడా చూడరు.

తాజాగా నెల్లూరు నగరంలో మరో భూకబ్జా చోటు చేసుకొంది. ములుమూడి బస్టాండ్ సమీపంలో దాదాపు 20 లక్షల రూపాయల విలువచేసే నీటిపారుదలశాఖకు చెందిన పది అంకణాల స్థలంలో పక్కా భవనం వెలసింది. ఈ భవనానికి శ్రీ ఆంజనేయ హరిహర రియల్ ఎస్టేట్ అనే నామకరణం కూడా చేశారు. రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తున్నట్లు నమ్మించి, ఇక్కడంతా భూ దందా వ్యవహారాలు సాగిస్తుంటారు. తొలుత ఈ స్థలంలో ఓ మెకానిక్ చిన్నపాటి రేకుల షెడ్డును ఏర్పాటు చేసుకుని ద్విచక్ర వాహనాలకు వాటర్ సర్వీస్ చేసేవాడు.

మెకానిక్ నుంచి కొనుగోలు చేసినవారు ఈ స్థలంలో పక్కా భవనాన్ని నిర్మించారు. తొలుత మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు భవన నిర్మాణానికి అభ్యంతరం వ్యక్తం చేసినా రాజకీయ జోక్యం కారణంగా వెనకడుగు వేయాల్సి వచ్చింది. ములుమూడి బస్టాండ్ వ్యాపార కూడలి కావడంతో ఇక్కడ స్థలాలు అధిక ధరలు పలుకుతున్నాయి. తొలుత ఈ పక్కా భవనంలో మందాకిని బార్ అండ్ రెస్టారెంట్‌ను ఏర్పాటు చేయాలని భావించారు. ఇందుకు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి అభ్యంతరం చెప్పడంతో బ్రాందీషాపు ఏర్పాటును విరమించుకున్నారు.



ఇరిగేషన్ స్థలాన్ని దురాక్రమించి కట్టిన భవనమిదే.

నీటిపారుదల శాఖకు చెందిన ఈ స్థలం ఆక్రమించి పక్కా భవనం నిర్మించిన వారందరూ కాంగ్రెస్ పార్టీకి చెందిన వారు కావడం విశేషం. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ప్రక్కన వుండేవారంతా ఇందులో భాగస్వాములుగా వున్నారు. చోటా నాయకులంతా కబ్జాచేసి నిర్మించిన భవనంలో తిష్ట వేస్తుంటారు. కాంగ్రెస్ పార్టీతోపాటు, తెలుగుదేశం, ప్రజారాజ్యం, సిపిఎం పార్టీలకు చెందిన నాయకులు ఎవరు కూడా దీనిపై స్పందించడం లేదు. ఇటువంటి సంఘటనలు నగరంలో అనేకం వున్నాయి. వీటిపై కూడా ప్రభుత్వ పరంగా తగిన చర్యలు లేకపోవడంతో మరిన్ని భూకబ్జాలు జరిగిపోతున్నాయి.



## పుకార్లు లేపకండి!



నా కెరీర్ ప్రారంభంలో ఒకసారి బురద చల్లారు. మళ్లీ ఈ మధ్య మాదకద్రవ్యాలు సేవిస్తున్నానని పుకార్లు లేపారని నటి త్రిష వాపోయింది. ఈ విషయమై మాట్లాడుతూ నాకెలాంటి సినీ నేపథ్యం లేదు. దక్షిణాదిలో నేను నటించిన సినిమాలే నన్ను హీరోయిన్‌గా నిలబెట్టాయి. బాలీవుడ్‌కు పంపాయి. కట్టా మీఠా పరాజయమైనంత మాత్రాన నాకు బాలీవుడ్‌లో అవకాశాలు రాకుండా పోవు. ప్రతి చిన్న విషయానికి ఆందోళన చెందడం నాకు అలవాటు లేదు. అన్నీ సర్దుకొంటాయి. త్రిషను అభిమానులు ఆదరిస్తూనే వుంటారని చెప్పుకొచ్చింది.

## అన్ని భాషల్లో నటించాలి!



అందం మాత్రమే కాదు అభినయం కూడా తన స్వంతం అని చాటి చెప్పిన నటి ఐశ్వర్యరాయ్. ఒక ట్రెండు సినిమాలకే తెరమరుగవుతున్న నేటి తరం కథానాయికల తీరుకు భిన్నంగా 15 ఏళ్లుగా వెండితెరపై జైత్రయాత్ర కొనసాగిస్తుంది. రోబో చిత్ర షూటింగ్ ప్యాచ్ వర్క్‌లో పాల్గొనను వచ్చిన ఆమె పిచ్చాపాటీగా మాట్లాడింది. చిత్ర పరిశ్రమలో గుర్తింపు కీలకం. ప్రాంతీయ సినిమా, జాతీయ సినిమా అంటూ తేడా లేకుండా నటించాలి. హాలీవుడ్ చిత్రాల్లో నటించాలన్న ఆశ చాలామందికి వుంటుంది. నావరకు పెద్దగా ప్రయత్నించకుండానే అవకాశం వచ్చింది. మీడియాను హీరోయిన్లు విమర్శిస్తుంటారు. మీడియా వల్ల నటీనటులకు చేకూరినంత మేలు మరొకరికి జరగదు. కొంచెం ప్రతిభ చూపితే చాలు. ఆ ప్రతిభను ప్రోత్సహించే విషయంలో మీడియా ముందుంటుందని ఐశ్వర్య తన మనసులోని భావాలను వెల్లడించింది.

## ఆనందంగా వున్నాను!



ఆగష్టు 29వ తేది తన పుట్టిన రోజు జరుపుకొన్న నాగార్జున చాలా ఉత్సాహంగా కనపడ్డాడు. కారణమడిగితే పుత్రోత్సాహమన్నాడు. మా పెద్దబ్బాయి నాగచైతన్య నటించిన 'ఏమాయ చేసావె' చిత్రం బాగా ఆడింది. ప్రస్తుతం అతని చేతిలో మంచి చిత్రాలున్నాయి. చిన్నబ్బాయి అఖిల్ సినీతారల క్రికెట్ మ్యాచ్‌లో మెరుపులు మెరిపించాడు. వాడికి 'మా'లో సభ్యత్వం వుంది. అందుకే ఆడించాను. అఖిల్ భవిష్యత్తు బాగుంటుందని విశ్వసిస్తున్నాను. ఈ యేడాది నేను నాలుగు సినిమాల్లో నటిస్తున్నాను. అన్నింటా హ్యాపీనే. అందువల్ల ఈ యేడాది మంచి చేసిందని విశ్వసిస్తున్నానన్నారు.

## తెలుగువాళ్లు... మంచివాళ్లు!



భీమిలి కబడ్డీ జట్టు, హ్యాపీ హ్యాపీగా చిత్రాల్లో హీరోయిన్ శరణ్యా మోహన్ తెలుగు ప్రేక్షకులను బాగా ఆకట్టుకొంది. శరణ్యాది కేరళ. ఆమె తల్లితండ్రులు అక్కడ వైకెబి డ్యాన్స్ అకాడమీ నిర్వహిస్తున్నారు. దీంతో శరణ్యా చిన్నప్పుడే గజ్జ కట్టింది. భరత నాట్యం, మోహినీ అట్టం, కూచిపూడి నృత్యాలు బాగా చేస్తుంది. మొదట కొంతమంది తెలుగులో ఓవర్ యాక్టింగ్ చేయాలన్నారు. కానీ ఇక్కడ అలా లేదు. నటన చాలా సహజంగా వుంది. యూనిట్‌లో అందరూ హీరోయిన్‌ను ఆదరిస్తారు. అభిమానంగా చూసుకొంటారంది శరణ్యా. గ్లామర్ పాత్రలు తనకు నప్పవని, అందువల్లే అభినయ ప్రధాన పాత్రలనే ఎంచుకొంటానని వివరించింది.

## రాజమౌళి మెచ్చిన దర్శకులు



మర్యాదరామన్న చిత్ర విజయం తర్వాత దర్శకుడు రాజమౌళి స్టామినా పరిశ్రమలో ఇంకాస్త పెరిగింది. విజయాన్ని ఎంజాయ్ చేస్తున్న రాజమౌళి మాట్లాడుతూ ముందు ఈ చిత్రం పరిమిత బడ్జెట్‌లో తీద్దామనుకొన్నాను. కారు బ్లాస్టింగ్, వంతెన మీద చిత్రీకరించిన క్లైమాక్స్ గ్రాఫిక్స్ కోసం బాగా ఖర్చు పెట్టేశాం. కానీ ఈ రెండు సన్నివేశాలు ప్రేక్షకులకు బాగా నచ్చాయి. తనను అభిమానించేవారు ఎందరో వున్నా తనకు మాత్రం తెలుగు సినీ దర్శకుల్లో వినా యక్ మంచి మిత్రుడని, సుకుమార్ మేకింగ్ బాగుంటుందని, బొమ్మరిల్లు ఫేం భాస్కర్ కథ బాగా వ్రాస్తాడని రాజమౌళి చెప్పుకొచ్చారు.

## తకిట తకిట... తలనొప్పే!



అల్లూరు రహీం

అందాల నటి భూమిక నిర్మాతగా వ్యవహరించి డౌన్‌టౌన్ ఫిలిమ్స్ పతాకంపై నిర్మించిన చిత్రమే తకిట తకిట. ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలను శ్రీహరి నాను నిర్వహించాడు. ఈయన గతంలో భూమిక టైటిల్‌రోల్ పోషించిన సత్యభామ చిత్రానికి దర్శకుడు. రెండేళ్ల క్రితం విడుదలై సూపర్ హిట్ అయిన 'హ్యాపీడేస్' సినిమా స్ఫూర్తితో ఈ చిత్రం రీళ్లు చుట్టేశాడు. అందరూ నూతన నటీనటులు. కాలేజి క్యాంపస్‌లో కొంచెం ప్రేమ, కొంచెం నవ్వు, మరి కొంచెం కన్నీరు ఫార్ములాలో చిత్రం నడుస్తుంది. ఐదు గంటల సినిమాగా తకిట తకిటను తీసి, దాన్ని రెండు గంటల పది నిమిషాలకు ఎడిట్ చేయడంలో ఫీల్ మిస్ అయ్యింది. అప్పటికీ ఈ చిత్రానికి జనాన్ని రప్పించను నాగార్జున, అనుష్క, భూమిక అతిథి పాత్రలలో నటించినా ఆ పాత్రలు గొప్పగా లేవు. కో ఎడ్యుకేషన్‌లో చదువుకొనే యువతీ యువకులు హద్దులు దాటే స్నేహ మకరందపు భావనల్లో వుంటారు. పరీక్షకు ముందు బుద్ధి వికసించను ఓ పెగ్ మందు కొడతారు. హత్తుకొంటారు. పెదవులు సైతం కలుపుతారు. ఇదంతా స్వచ్ఛమైన స్నేహంలో భాగమెలా అవుతుంది శ్రీహరినాను గారు? అయితే ఈ చిత్రానికి సంగీత దర్శకుడు బోబో శశి ప్రాణం పోసాడు. ఆయన బాణీలు కట్టిన కమాన్ కమాన్, నీ తియ్యని మాటలు వింటుంటే, మిల మిల, జాయ్ జాయ్, తెలుసా ఏమిటో పాటలు బాగున్నాయి. మగధీర, అరుంధతి చిత్రాల కెమెరామెన్ సెంథిల్‌కుమార్ ఈ చిత్రానికి కెమెరామెన్ కావడంతో సన్నివేశాలు తెరపై నీట్‌గా కనపడతాయి. బొమ్మరిల్లు ఫేం మాటల రచయిత రవి వ్రాసిన మాటల్లో యాసిడ్ పోసేది బాస్టర్డ్స్. పిల్లలు ఎక్కడున్నారన్నది కాదు... ఎంత గొప్పగా వున్నారన్నది ముఖ్యం అన్నవి మాత్రమే కాస్త చెప్పుకోతగ్గవి. పరీక్ష హాలులో విద్యార్థులు దైవ పూజలు చేయడం, కాలేజిలో సీనియర్ ప్రేమికులు స్వరూప్ – సుహాసినిల ఆత్మహత్య సన్నివేశం కాస్త గుండె బరువెక్కిస్తుంది.

చిత్ర సమీక్ష

చిత్ర కథలోనికి వెళ్తే ఇంజనీరింగ్ చదివే చందన(హరిప్రియ), శ్రీ(హర్షవర్ధన్)తోపాటు కిషోర్ – నందిని, మహేష్ – భక్తి స్కడ్ మంచి మిత్రులవుతారు. చందన, శ్రీ డబ్బున్న కుటుంబీకులు. మహేష్ అనాథ. నందిని తమిళ అమ్మాయి. వీరికి అమెరికా నుంచి ఎన్ఆర్ఐ కోటాలో వచ్చి చదివే జసివ(ఎనాఎలీస్) తోడవుతుంది. ఇంట్లో ఒకటి చెప్పి మిత్రులంతా కలసి బెంగుళూరు వెళ్తారు. అక్కడ లగేజ్ కోసం వెళ్లి దారితప్పిన చందన, శ్రీల జంటను నిర్బంధించిన ఇన్స్‌పెక్టర్ ఆమెపై అత్యాచారం చేయబోగా అతని రివాల్వర్‌తోనే కాళ్లపై కాల్చి తప్పించుకొంటారు. ఆ తర్వాత మిత్రులంతా కలసి తమ బ్యాచ్‌లోని కిషోర్, నందినిల వివాహం చేస్తారు. చందనకు ఇంట్లోవాళ్లు పెళ్లి సంబంధాలు చూస్తుండగా వచ్చే పెళ్లిళ్ల బ్రోకర్‌తో తాగిన మైకంలో శ్రీ కాస్త అతిగా వాగుతాడు. దీంతో ఈ ప్రేమికులిద్దరి మధ్య గ్యాప్ పెరుగుతుంది. ఇంతలో మరో జంట మహేష్, భక్తిల మధ్య ప్రేమ విరసిల్లుతుంది. దీనికి స్కడ్ సహకరిస్తాడు. దాక్షాయణి, శ్రీని పెళ్లి చేసుకోవాలని చందన – శ్రీల మధ్య దూరం పెంచుతుంది. చివరికి ఈ ప్రేమికులు నిజాలు తెలుసుకొని ఒకటవ్వడంతో చిత్రం ముగుస్తుంది. చిత్రంలో నూతన నటీనటులు నటించారు. కానీ టైటిల్స్‌లో నటులను వారి పేర్లను కలిపి వేసే ప్రయత్నం చేయలేదు. దీనివల్ల ఏ నటుడు ఏ పాత్రలో నటించాడన్న అదనపు గందరగోళంతో ప్రేక్షకులు సినిమా హాల్ నుంచి బయటకు రావాల్సి వస్తుంది. నటీనటులు హర్షవర్ధన్, హరి ప్రియ, త్రినేత్రుడు, కార్తీక్, త్రిలోక్, అనంత్, ఎనా ఎలీస్, భక్తి పుంజలిలు కొత్తవారైనా మెరుగ్గా నటించారని మాత్రం చెప్పక తప్పదు.



# ఘనంగా జరిగిన చెస్ పోటీలు!



చెస్‌పోటీలో విజేత కృష్ణకు బహుమతినందిస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, ప్రక్కన కలెక్టర్ రాంగోపాల్.

సింహపురి నగరం రాష్ట్రస్థాయి చెస్ పోటీలకు ముచ్చటగా మూడవసారి ఆతిథ్యమిచ్చింది. వరుసగా గత రెండు సంవత్సరాలుగా నెల్లూరులో ఈ పోటీలు జరిగాయి. మూడవ దఫా జరిగే 48వ రాష్ట్రస్థాయి చదరంగం పోటీలకు నెల్లూరు వేదిక కావడం విశేషం. రాష్ట్రవ్యాప్తంగా వివిధ జిల్లాల నుంచి 200 మందికి పైగా క్రీడాకారులు పాల్గొన్నారు. ఇందిరాభవన్‌లో మూడు రోజులపాటు జరిగిన ఈ పోటీల్లో అనుక్షణం ఉత్కంఠత నెలకొనింది. మేటి క్రీడాకారులు తమ ఎత్తులు, పైఎత్తులతో క్రీడలకు ప్రాణం పోశారు. చెస్ అసోసియేషన్, జిల్లా క్రీడాప్రాధికార సంస్థ ఆధ్వర్యంలో జరిగిన ప్రారంభ, ముగింపు వేడుకలకు జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, జిల్లా కలెక్టర్ రాంగోపాల్ హాజరైనారు. చదువుతోపాటు ఆటల్లోనూ ప్రావీణ్యం సంపాదించాలని, చెస్ ద్వారా మెదడు చురుకుగా పనిచేస్తుందన్నారు. విజేతగా నిలచిన హైదరాబాద్‌కు చెందిన కృష్ణకు మెమెంటో అందజేశారు. రాష్ట్ర చెస్ అసోసియేషన్ అధ్యక్ష కార్యదర్శులు శివప్రసాద్, కన్నారెడ్డి పాల్గొన్న ఈ కార్యక్రమంలో డిఎస్‌డిఓ వెంకటేశ్వర్లు, అమరావతి హోటల్ నిర్వాహకుడు కృష్ణారెడ్డి, రాష్ట్ర చెస్ అసోసియేషన్ సంయుక్త కార్యదర్శి సుమన్ తదితరులు పాల్గొన్నారు.


రిటైర్డ్ జిల్లా పరిషత్ సూపరింటెండెంట్ తూపిలి రాధాకృష్ణయ్య - శకుంతలమ్మల కుమార్తె వేణీసుమన, బాలాజీల పెండ్లి ఆగష్టు 22వ తేది నెల్లూరు వేదాయపాళెంలోని యంజీఆర్ కళ్యాణ మండపంలో జరిగింది.

# మాడరన్ ఐ హాస్పిటల్ రెటీనా సెంటర్!

కంటి వైద్యరంగంలో పేరెన్నికగన్న మాడరన్ ఐ హాస్పిటల్ నూతనంగా మాడరన్ రెటీనా సెంటర్‌ను ప్రారంభించింది. పొగతోటలో ఏర్పాటైన ఈ సెంటర్‌ను మధురై అరవింద్ ఐ హాస్పిటల్ డైరక్టర్ డాక్టర్ పెరుమాళ్‌స్వామి ప్రారంభించాడు. దక్షిణ కోస్తా, రాయలసీమ జిల్లాలలో మొట్టమొదటి రెటీనా శస్త్రచికిత్సల సెంటర్‌ను మాడరన్ ఐ హాస్పిటల్ ఏర్పాటుచేయడం పట్ల నిర్వాహకులను ఆయన అభినందించారు.


రెటీనా సెంటర్‌ను ప్రారంభిస్తున్న మధురై ఐ హాస్పిటల్ డైరక్టర్ డాక్టర్ పెరుమాళ్ స్వామి దంపతులు. ప్రక్కన డాక్టర్ పిఎల్‌రావు, డాక్టర్ భారతి.

మాడరన్ ఐ హాస్పిటల్ నిర్వాహకులు డాక్టర్ పిఎల్‌రావు, డాక్టర్ భారతి మాట్లాడుతూ రెటీనా వ్యాధులకు సంబంధించిన అన్ని రకాల శస్త్రచికిత్సలను తమ ఆస్పత్రిలో చేయనున్నట్లు వివరించారు. కంటి లోపల రక్తం కారడం తదితర వ్యాధులకు మెరుగైన చికిత్స అందించనున్నట్లు తెలిపారు. దీనికోసం 40 లక్షల రూపాయల వ్యయంతో లూమీరా సర్జికల్ మైక్రోస్కోప్, అక్యురస్ విట్రెక్టమి యూనిట్‌ను నెలకొల్పామన్నారు. రాష్ట్రంలోనే మొట్టమొదటి సారిగా కంటిలో మైనస్, ప్లస్ పవర్ సమస్యలను అధిగమించేందుకు అత్యాధునిక టెక్నాలజీతో కూడిన లాసిక్ లేజర్ పరికరాన్ని అందుబాటులోకి తీసుకొచ్చినట్లు వివరించారు. ఎప్పటికప్పుడు మారుతున్న కాలానికి అనుగుణంగా ఆధునిక టెక్నాలజీని అందుబాటులోకి తెచ్చి కంటి వ్యాధులకు మెరుగైన చికిత్స అందించేందుకు కృషి చేస్తున్నట్లు వివరించారు. త్వరలో తమ ఆస్పత్రిలో ఐ బ్యాంక్‌తోపాటు కంటి మార్పిడి ఆపరేషన్లను నిర్వహించనున్నట్లు తెలిపారు. నగరానికి చెందిన ప్రముఖ వైద్యుడు డాక్టర్ పి.మధుసూధన్‌శాస్త్రి, డాక్టర్ హెబ్బార్, డాక్టర్ వెంకటేశ్వరరావు, డాక్టర్ జె.కె.రెడ్డి, రత్నం విద్యాసంస్థల అధినేత కె.వి.రత్నం, డాక్టర్ రంగనాథ్ తదితరులు వివిధ విభాగాలను ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో హాస్పిటల్ వైద్యులు గోపాలకృష్ణ, రాజశేఖర్, జ్యోతి, కృష్ణమూర్తి తదితరులు పాల్గొన్నారు.


బుర్లా గోపాల్‌రెడ్డి కుమార్తె ప్రత్యూష, ప్రదీప్‌కుమార్‌రెడ్డిల వివాహం ఆగష్టు 25వ తేది నెల్లూరు మైపాడుగేట్ సెంటర్‌లోని కెవిఆర్ కళ్యాణ మండపంలో జరిగింది.

# బ్రతకనేర్చిన బడిపంతుళ్లు

## గురుపూజోత్సవంలో కాకాణి చురక

గతంలో బ్రతికలేనివాడు బడిపంతులు అనేవారు, ఈనాడు బ్రతకనేర్చిన వాడు బడిపంతులు అంటున్నారు. ఆనాటి ఉపాధ్యాయులు, ఈనాటి ఉపాధ్యాయులకు ఎంత తేడా? అనేదానిపై జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో గురుపూజోత్సవం సందర్భంగా జరిగిన ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు ప్రదానోత్సవంలో చర్చ జరిగింది. జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఉపాధ్యాయ వృత్తి పవిత్రత గురించి తనదైనశైలిలో ప్రసంగించారు. వృత్తేదైవంగా భావించి విద్యార్థులను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దేదుకు ఆనాటి ఉపాధ్యాయులు అహర్నిశలు కష్టపడేవారు. జీతాలు తీసుకొంటున్న టీచర్లలో వృత్తి పట్ల గౌరవం, బాధ్యత లేకుండా పోయిందని ఆవేదన చెందారు. విద్యార్థులు ఏమైతేనేం అనే ధోరణిలో నేటి గురువులున్నారని బాధపడ్డారు. ఇది మంచిది కాదని, భావిభారత పౌరులను తీర్చిదిద్దే గురుతర బాధ్యత ఉపాధ్యాయులపై వుందన్న సత్యాన్ని గ్రహించాలన్నారు. తనకు ఎప్పుడూ గురువులంటే గౌరవమని, అందుకే తాను ఎన్ని పాఠశాలలను తనిఖీ చేసినా టీచర్ల సీట్లో కూర్చోలేదని వారిపట్ల తనకున్న గౌరవాన్ని తెలియజెప్పారు.


జడ్పీలో జరిగిన గురుపూజోత్సవంలో ఉత్తమ ఉపాధ్యాయులను సత్కరిస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, కలెక్టర్ రాంగోపాల్.

# పేదలకు గ్యాస్ కనెక్షన్లు!

## కేంద్రం సరికొత్త పథకం


అందుబాటులో గ్యాస్ సిలిండర్లు.

దారిద్ర్యరేఖకు దిగువనవున్న పేదలకు సబ్సిడీపై కేంద్ర ప్రభుత్వం గ్యాస్ కనెక్షన్లు ఇవ్వనుంది. ప్రతి పేద కుటుంబానికి గ్యాస్ కనెక్షన్ వుండాలన్న లక్ష్యంతో కేంద్ర ప్రభుత్వం ఈ నూతన పథకానికి శ్రీకారం చుట్టింది. గతంలో స్వయం సహాయక సంఘాల్లో వున్న మహిళల్లో కొంతమందికి మాత్రమే గ్యాస్ కనెక్షన్లు అందజేయడం జరిగింది. ఈ దఫా పొదుపు గ్రూపులతో సంబంధం లేకుండా అందించేందుకు చర్యలు తీసుకుంటున్నారు. ఇటీవల కేంద్ర పెట్రోలియం మంత్రిత్వ శాఖ కూడా గ్యాస్ కనెక్షన్ల మంజూరుకు అనుమతి కూడా ఇచ్చింది. గ్యాస్ కనెక్షన్‌కు లబ్ధిదారుడు చెల్లించే మొత్తంలో 50 శాతం కేంద్రం సబ్సిడీ అందజేస్తుంది. 1400 రూపాయలకు 700 రూపాయలు కేంద్రం భరిస్తుంది. ఇప్పటివరకు గ్యాస్ కనెక్షన్లకు నోచుకోని పేద కుటుంబాలకు సబ్సిడీ పథకం ఎంతో ఊరట నిస్తుంది.

## పలుచనైన ఆనం సోదరులు

16వ పేజీ కొరవ

వేసిన వివేకానందరెడ్డి, నెల్లూరు నగరంలో విగ్రహ స్థాపనకు మోకాలు అడ్డం పెట్టాడు. అనుమతి కోసం పెట్టిన దరఖాస్తును మునిసిపల్ ఆఫీసు చెత్త బుట్టలో వేయించాడు. నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి స్వయంగా ఒక లేఖ వ్రాసినా పట్టించుకోలేదు. యాత్ర సమయం దగ్గర పడ దంతో, శ్రీధర్‌రెడ్డి బృందం అనుమతి రాకపోయినా, కొత్తహాల్ సెంటర్‌లో విగ్రహ స్థాపనకు గుంట తవ్వడం మొదలు పెట్టింది. వివేకా అక్కడకు వంద మంది పోలీసులను పంపించి, వారిని తరిమి వేయచూశాడు. కానీ శ్రీధర్‌రెడ్డి ఆవేశం ముందు పోలీసు బలగం చాలలేదు. గొడవ, గందరగోళం, పరిస్థితి చెయ్యిదాటి పోతుందన్న భయంతో పోలీసులు మీకు అనుమతి ఇచ్చాము, విగ్రహం పెట్టుకోండి అని చెప్పి, అందరినీ చల్లబరచారు. అది వివేకాకు కంటగింపుగా మారింది. పక్కరోజు కథ మళ్లీ మామూలు. విగ్రహానికి అనుమతి లేదని మునిసిపల్ అధికారుల చేత మళ్లీ అభ్యంతరం చెప్పించాడు. మళ్లీ గొడవ. శ్రీధర్‌రెడ్డి అనుచరులు కొందరు ప్రక్కనేవున్న మిద్దె ఎక్కి దూకి చస్తామని బెదరించారు. పోలీసు అందరినీ అరెస్టు చేసింది. అంత ఉద్రిక్తత పెరిగిన తర్వాత అరెస్టులతో వేడి చల్లారుతుందా? ఐదవ నగర పోలీసు స్టేషన్ ముందు వేలాది జనం గుమిగూడారు. పరిస్థితి తన చెయ్యి దాటి పోయిందనే నిరాశతో వివేకానందరెడ్డి శ్రీధర్‌రెడ్డి ఒత్తిడికి తలవంచి, గాంధీబొమ్మకు దక్షిణంగా రోడ్డు డివైడర్ మీద వైఎస్ విగ్రహం స్థాపించేందుకు అనుమతి ఇస్తున్నట్లు అధికారుల చేత చెప్పించాడు. దానితో కథ సుఖాంతమైనది.

జగన్ ఓదార్పు యాత్ర కోసం ఒకచోట అయినా వైఎస్ విగ్రహం పెట్టక తప్పదని తెలిసి కూడా ఇంత ఆగం సృష్టించడం వివేకా తెలివి తక్కువ తనం. తన ప్రమేయం లేకుండా జరిగే ఏ పని అయినా అడ్డం కొట్టాలనే అహంకారం ఆయన చేత ఆ తప్పు చేయించింది. కోరి తగువు కొని తెచ్చుకొనే పరిస్థితి తెచ్చి పెట్టింది. ఈ వివాదంతో ఆనం వారి నిజ రూపం మరొకసారి నెల్లూరు ప్రజలకు విశదంగా అర్థమైంది. రాజశేఖర్‌రెడ్డి బ్రతికి వున్నన్ని రోజులూ ఆయన వెనుక నీడ వలె తిరిగినవారు, ఇప్పుడు ఆయన విగ్రహం పెట్టడం కూడా సహించలేక పోతున్నారు. వారికి కావల్సింది తమ రాజకీయ అధికారమే తప్ప విశ్వాసం, కృతజ్ఞతలు కాదు. నెల్లూరు నగరంలో వైఎస్ విగ్రహం కూడా పెట్టకుండా అడ్డుకొన్నామని చెప్పి, ముఖ్యమంత్రి రోశయ్య వద్ద మంచి మార్కులు కొట్టేయాలన్న కుత్సితంతో వ్యవహరించారు. కానీ అది వారికి అలివి కాలేదు. జనం ముందు పలచపడ్డారు.

## రోశయ్యను మారిస్తే ఎవరు?

మొదటి పేజీ కొరవ

స్పీకర్ కిరణ్‌కుమార్‌రెడ్డి గత మూడు రోజులుగా ఢిల్లీలోనే మకాం పెట్టి వున్నారు. సోనియా గాంధీ, ఆమె కార్యదర్శి అహ్మద్ పటేల్‌ను కలిసి తన గోడు విన్పించుకొన్నాడు. ఆయనకు కేంద్ర హోంమంత్రి చిదంబరం అండ వుందని వినికిడి. అదే చిదంబరం ఆసరాతో డిఎల్.రవీంద్రరెడ్డి కూడా ఉట్టి ఎక్కడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆయన మకాం కూడా ఢిల్లీ. గీతారెడ్డి గత వారమే ఢిల్లీ వెళ్ళి వచ్చారు. బొత్సా సత్తిబాబుకు ఢిల్లీ వీధులతో పరిచయం జాస్తి. నిజం చెప్పాలంటే, ఈ జాబితాలో వున్న రాష్ట్ర మంత్రులెవరికీ లేని ఢిల్లీ పరిచయాలు బొత్సాకు వున్నాయి. వాటన్నిటినీ ఉపయోగపెడుతున్నారాయన. ఒక్కొక్కరిది ఒక్కొక్క వాదన. స్పీకర్‌గా తాను అందరు కాంగ్రెస్ ఎమ్మెల్యేలతో సంబంధాలు పెట్టుకొని వున్నానని, నేదురుమల్లి జనార్దనరెడ్డి వంటి సీనియర్ సహకారం తనకు లభిస్తుందని, అందువల్ల జగన్‌కు ముక్కుతాడు వేసి రాష్ట్రంలో పార్టీని నడిపిస్తానని కిరణ్‌కుమార్‌రెడ్డి చెప్తున్నాడు. తెలంగాణ సమస్య వాకిట్లో పొంచి వుంది కాబట్టి, కొత్త నాయకత్వం తెలంగాణ నుంచి, అదీ రెడ్డి కులం నుంచి వుంటేనే ఆ సమస్యను ఎదుర్కోగలుగుతాము కాబట్టి తమకు అవకాశం ఇవ్వాలని జైపాల్‌రెడ్డి, జానారెడ్డి ప్రభృతులు వాదిస్తున్నారు. కమ్మ కుల ప్రతినిధిగా తనకు ఛాన్స్ ఇస్తే, చంద్రబాబు నాయుడును, ఆయన తెలుగుదేశం పార్టీని నిర్వీర్యం చేసి రేపటి ఎన్నికలలో కాంగ్రెస్‌కు నలభై ఎమ్పీ స్థానాలు గెలిపించి ఇస్తానని దగ్గుబాటి పురంధరేశ్వరి చెప్తున్నది. ఎప్పుడూ ఆ రెండు కులాలేనా అన్న అసంతృప్తి బహుళ జనావళిలో వుంది కాబట్టి, తనకు అవకాశం ఇస్తే అన్ని కులాల వారినీ కాంగ్రెస్‌వైపు మళ్లిస్తానని బొత్సా సత్తిబాబు గట్టిగా వాదిస్తున్నాడు.

మొత్తం మీద తాత పోతే బొంత నాది అన్న తీరులో కాంగ్రెస్‌లో వాదులందరూ ముఖ్యమంత్రి పదవి కోసం, రోశయ్య ఆ కుర్చీలో వుండగానే ఆరాటపడడం ఢిల్లీ పెద్దలకు చిరాకు తెప్పిస్తున్నది.

## రెడ్లకే పాలించే అర్హత

మొదటి పేజీ కొరవ

దారు, సంస్థానాధీశుడు కూడా రెడ్డి కులస్తుడు కాదన్నది చరిత్ర చెప్తున్న నిజమని వీరి వాదన. నిజాం పరిపాలనలోని తెలంగాణ ప్రాంతంలో కూడా 'గడి' కల్గిన దొరలలో అత్యధికులు రెడ్డి కులేతరులే. నిజాం తర్వాత అంతటి భూస్వామిగా ఎదిగి, దాదాపు రెండు లక్షల ఎకరాల వ్యవసాయ భూమి స్వంతం చేసుకొన్న విస్సా రామచంద్రరావు రెడ్డి కాదు. నిజాం పాలనలో గ్రామాధికార పదవులైన పటేల్, పట్వారీలను మాత్రమే రెడ్డి కులస్తులకు ఇచ్చేవారు. జమీందారీ సంస్థానంలో అత్యధిక భాగం వెలమ కులానికి అప్ప చెప్పారు. వరంగల్, మహబూబ్‌నగర్‌లలో కొన్ని సంస్థానాలు మాత్రమే రెడ్డి కులస్తులు నిర్వహించారు. రాయలసీమకు చెందిన కడప, కర్నూలు జిల్లాలలో ఏ కారణం వల్లనో జమీందారులు లేదా సంస్థానాధీసులను అనుమతించలేదు బ్రిటీష్ ప్రభుత్వం. ఆ ప్రాంతం మొత్తం కలెక్టర్ల పాలనలోనే కొనసాగింది.

జైపాల్‌రెడ్డికి కేంద్ర నాయకత్వంలో పలుకుబడి ఎక్కువ. ఆయన చెప్పే మాటకే విలువ ఎక్కువ. పైగా ఆయనకు మేధావి అనే పేరు కూడా వుంది. అందువల్ల అధిష్ఠానంతో ఆయన ఒకసారి ఒక మాట చెప్పిన తర్వాత, ఈ చరిత్ర అంతా వివరించి, ఆయన మాట నిజం కాదని, బ్రిటీష్ సిద్ధాంతం గాలి కబురు మాత్రమే అని వివరణ ఇచ్చేందుకు ఎవరికి అవకాశం లభిస్తుంది? ముఖ్యమంత్రిగా తాను రాష్ట్రానికి రావడానికే జైపాల్‌రెడ్డి ఈ సిద్ధాంతం తెర మీదకు తెచ్చాడని గోడు గోడుమంటున్నారు తతిమావారు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

జనార్దనరెడ్డి కాలనీలో జరిగిన అభివృద్ధి కార్యక్రమాల్లో సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డితో కలిసి పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఓ ప్రజారాజ్యం పార్టీ కార్యకర్త ఆయన మెడలో ఆ పార్టీ కండువా వేయగా చివర వరకు దాన్ని అలానే వుంచుకొని తిరిగారు. పత్రికల ఫోటోగ్రాఫర్లకు ఆ కండువాతోనే ఫోజులిచ్చి హల్‌చల్ చేశారు.

### జగన్ వర్గీయుల అరెస్టు

క్రొత్తహాలు సెంటర్‌లో వైఎస్ విగ్రహం ఏర్పాటుపై అనుమతివ్వాలని పట్టుబట్టిన జగన్ వర్గీయులైన కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అనిల్‌కుమార్, రూప్‌కుమార్‌లను డిఎస్పీ రాధిక ఆధ్వర్యంలో పోలీసులు అరెస్టు చేసి నగరానికి దూరంగా వున్న ఫిఫ్త్‌టౌన్ పోలీస్‌స్టేషన్‌కు తరలించారు. ఈ సందర్భంగా ఇరువురు కార్యకర్తలు న్యూటాకీస్ వద్ద భవనం మీదకు ఎక్కి ఆత్మహత్యకు ప్రయత్నించగా వారిని అరెస్టుచేసి త్రీటౌన్ పోలీసులు వారిపై కేసులు నమోదు చేశారు.

### శిలాఫలకంపై వివాదం

నెల్లూరు 12వ డివిజన్‌లో జరిగిన అభివృద్ధి కార్యక్రమాలలో ఏర్పాటుచేసిన శిలాఫలకంపై వివాదం ఏర్పడింది. స్థానిక కార్పొరేటర్ కోటంరెడ్డి సంధ్య, డివిజన్ ఛైర్మన్ కత్తి శ్రీనివాసులు పేర్లను శిలాఫలకాలలో పెట్టకపోవడంపై రగడ రేగింది. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి కావాలని తమ పేర్లను తొలగించారని వారు ఆరోపించారు.

### క్యాన్సర్‌కు అత్యాధునిక చికిత్స

క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు సైబర్ నైఫ్ పరికరం ద్వారా అత్యాధునిక వైద్య చికిత్స అందుబాటులోకి వచ్చినట్లు అపోలో వైద్యులు డాక్టర్ వెంకట్, ఇన్ఫర్మేషన్ సెంటర్ నిర్వాహకుడు డాక్టర్ నరేంద్రరెడ్డి తెలిపారు. ప్రాథమిక పరీక్షలను నగరంలోని తన సెంటర్‌లో నిర్వహిస్తారని వివరాల కోసం 98493 56429లో సంప్రదించవచ్చుని తెలిపారు.

## చీలనున్న కాంగ్రెస్

మొదటి పేజీ కొరవ

తారు. లేకుంటే ఇప్పుడున్న పరపతికి వచ్చే నష్టం ఏదీ లేదు. అందువల్ల పార్టీతో అన్ని బంధాలు తెంపుకొని గోదాలో దిగిపోయారు. నెల్లూరు నగరం వరకు ఆనం వారిది మేకపోతు గాంభీర్యం తప్ప వారికంటూ చెప్పుకోదగిన రాజకీయ బలం ఏమీ లేదని కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి ఇప్పటికే రుజువు చేశాడు. నగరంలోని ప్రతి డివిజన్‌లో, ప్రతి వీధిలో ఆనం వారికి మనిషి దొరకని పరిస్థితి కల్పించాడు. రాజీవ్ భవన్ దెబ్బకు తట్టుకోలేక, ప్రజారాజ్యం ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డిని తోడు పెట్టుకొని వీధులలో తిరగవలసిన దుర్గతి పట్టింది వివేకానందరెడ్డికి. ఒంటరిగా వెళ్తే జనం తరుము కొంటారేమో అని భయపడుతున్నాడు పాపం. ఈ నేపథ్యంలో ఓదార్పు యాత్ర నిర్వహణ కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డికి లభించడం ఆనం వారికి మరింత ఖేదం కల్గించే విషయం.

అల్లూరు మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి జగన్ పక్షం వహించడం ఒక విశేషం. ఆయన నియోజకవర్గంలో ఇప్పటి వరకు ఆయనకు పార్టీ పరంగా ఎదురు లేదు. అయినా పార్టీని వదలడానికి సిద్ధపడుతున్నాడు. కాంగ్రెస్‌పార్టీలో ఇక ముందు రెడ్డి కులం పెత్తనం వుండక పోవచ్చునన్నది ఆయన అనుమానమట. జగన్ ద్వారానే రెడ్డి రాజ్యం ప్రతిష్ఠితమౌతుందన్న నమ్మకమే ఆయన్ను యాత్ర వైపు నడిపిస్తున్నదని చెప్తున్నారు.

మరొక మాజీ ఎమ్మెల్యే నెలవల సుబ్రహ్మణ్యం జై జగన్ అంటున్నాడు. సూళ్లూరుపేట రాజకీయాలలో తనకు ఇక ఎప్పటికీ అవకాశం రాకపోవచ్చునన్నది సుబ్రహ్మణ్యం అనుమానం. నేదురుమల్లి జనార్దనరెడ్డితో వచ్చిన విభేదాల వల్ల మొన్నటి ఎన్నికలలో టిక్కెట్ చేజారిపోయింది. రేపటి ఎన్నికలలోనూ అదే పరిస్థితి ఏర్పడవచ్చు. జగన్ దారిలో నడిస్తే ఆ పార్టీ టిక్కెట్ అయినా ఖాయం అవుతుందన్న ఆశతో అటువైపు గోడ దూకేశాడు.

ఇంతకు మినహా నెల్లూరు జిల్లా కాంగ్రెస్ వాదులలో చెప్పుకోదగిన మరెవ్వరూ జగన్ యాత్రలో పాలు పంచుకొనే అవకాశం కన్పించడం లేదు. ఆనం సోదరులు, ఆదాల ప్రభాకర్‌రెడ్డి తాము పార్టీ విధేయులమని తేల్చి చెప్పేశారు. నేదురుమల్లి జనార్దనరెడ్డి విషయం చర్చలోకే రాదు. కాంగ్రెస్ పార్టీలోనే చివరి వూపిరి వదలడం ఆయన లక్షణం. అధిష్ఠానం గీత దాటక పోవడం ఆయన తత్వం. కేంద్ర మంత్రిణి పనబాక లక్ష్మి కూడా అదే దారి. వైఎస్ మీద కానీ, జగన్ పట్ల కానీ ఆమెకు ఎటువంటి ప్రేమాభిమానాలు లేవు. అనుబంధమూ లేదు. అయితే ఆమె భర్త పనబాక కృష్ణయ్య మొదట మొదట వురవుర లాడాడు, జగన్‌కు జిందాబాద్ కొట్టడానికి. కానీ సతీమణి గుడ్లురమడంతో చల్లగా సర్దుకొన్నాడు. నెల్లూరు జిల్లాకు చెందిన మరొక ఎమ్పీ చింతా మోహన్ ఆది నుంచీ అధిష్ఠానం విధేయుడు. కప్పగంతులు వేసే అలవాటు ఆయనకు లేదు. మాగుంట శ్రీనివాసులురెడ్డి కూడా సోనియమ్మ కరుణే తనకు ముఖ్యమంటున్నాడు

కాంగ్రెస్ ముఖ్యులెవరూ పాలు పంచుకోకపోయినా ఓదార్పు యాత్ర మాత్రం దిగ్విజయంగా జరిగి తీరుతుంది. గ్రామాలలో జగన్ రాక పట్ల కన్పిస్తున్న ఆసక్తి, వ్యక్తమౌతున్న అభిమానం ఆశ్చర్యం కొల్పే రీతిలో వున్నాయి. నాయకులు ముందు లేకపోయినా జగన్ వెంట నడవడానికి గ్రామ, మండలస్థాయి నేతలు చాలా మందే వురవురలాడుతున్నారు. ఉత్సాహం చూపుతున్నారు. ఇటువంటి వారందరినీ సమీకృతం చేయడానికి టిటిడి బోర్డు మాజీ అధ్యక్షుడు కరుణాకర్‌రెడ్డి వారం రోజుల నుంచి నెల్లూరులోనే మకాం పెట్టి వున్నాడు. కడప జిల్లా నుంచి జగన్ బృందం ఒకటి వచ్చి వుంది. యాత్రకు కావలసిన డబ్బు దస్కం సమకూర్చడంతో పాటు, విగ్రహాల సరఫరా బాధ్యత కూడా వీరు నిర్వర్తిస్తున్నారు. అన్ని జిల్లాలలో జరిగేదే ఇక్కడా జరగబోతున్నది. ఆ ఏర్పాట్లు, వనరుల సమీకరణ చూస్తే తన యాత్ర కోసం జగన్ ఎన్ని కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నాడో అంచనాకు కూడా అందడం లేదు.

## జనవాణి

2వ పేజీ కొరవ

చూపలేరు. ఈ పథకాలు ఆయన్ను సామాన్య, మధ్య తరగతీయుల్లో ప్రత్యక్ష దైవాన్ని చేశాయనడం అతిశయోక్తి కాదు.

*టి.రమణయ్య, కావలి*

# గవర్నర్ చేతిలో పరిపాలనా పగ్గాలు?

## ● పెద్దగా పట్టించుకోని రోశయ్య

రాష్ట్ర పరిపాలన మెల్ల మెల్లగా గవర్నర్ చేతిలో ఇమిడి పోతున్న సంకేతాలు కన్పిస్తున్నాయి. ముఖ్యమంత్రి స్థానంలో రోశయ్య వున్నా పరిపాలనా పగ్గాలు మాత్రం తన చేత చిక్కించుకొన్నాడు ఇఎస్ఎల్ నరసింహన్. ఆయన గవర్నర్‌గా హైదరాబాద్‌కు వచ్చినప్పుడే ఈ సూచనలు వచ్చాయి. కేవలం రాజముద్రికలు అద్దే రబ్బరు స్టాంప్ కాదని, కేంద్రం తరపున వ్యవహారాలు నడిపే ప్రతినిధి అని అనుకొన్నారు. ఆ మాట అక్షరాల నిజమని రుజువౌతున్నదిప్పుడు.

కొత్త డిజిపిగా అరవిందరావు నియామకం పూర్తిగా గవర్నర్ ఇఎస్ఎల్.నరసింహన్ ఇష్టానుసారమే జరిగిందని తెలుస్తున్నది. ఈ పదవికి ప్రధానంగా నలుగురు పోటీ పడ్డారు. వారిలో గౌతమ్ కుమార్, దల్జీత్ సింగ్‌లకు స్వంత లాబీ లేదు. కేవలం సీనియారిటీ అర్హత మాత్రమే వుంది. కానీ మూడవ అభ్యర్థి దినేష్‌రెడ్డి చాలా పలుకుబడి కల్గిన అధికారి. కాంగ్రెస్ ఎమ్మెల్యే ఏరాసు ప్రతాపరెడ్డి దినేష్‌రెడ్డికి అండగా నిలబడ్డాడు. మాజీ మంత్రి, ముఖ్యమంత్రి రోశయ్యకు ప్రధాన మద్దతుదారు అయిన జెసిదివాకర్‌రెడ్డి కూడా దినేష్‌రెడ్డి కోసం పట్టుబట్టాడు. ఒక దశలో దినేష్‌కు నియామక పత్రం సిద్దమైంది, రేపు వచ్చి తీసుక వెళ్లవచ్చు అని చెప్పాడట ముఖ్యమంత్రి. కానీ చివరి నిముషంలో దినేష్‌రెడ్డి పేరు అదృశ్యమై అరవిందరావు పేరు ఖరారైంది. ఈ మార్పుకు కారణం గవర్నర్ పలుకుబడి అని చెప్తున్నారు.

అరవిందరావు ఆ పదవికి అన్నివిధాల అర్హుడు. గత యాభై ఏళ్లుగా మన రాష్ట్రాన్ని అతలాకుతలం చేస్తున్న నక్సలైట్ల సమస్యను ఒక దారికి తెచ్చిన వాడు ఆయనే. 2004లో వైఎస్ రాజశేఖర్ రెడ్డి అధికారంలోకి వచ్చిన తర్వాత ఇంటెలిజెన్స్ అధిపతిగా అరవిందరావు నక్సలైట్ల నిర్మూలనకు ఎనలేని కృషి చేశాడు. ఆధునిక కమ్యూనికేషన్ పరిజ్ఞానాన్ని ఉపయోగించి, అగ్రస్థాయి నక్సల్ నేతల అనుపానులు పసిగట్టి, నిశ్శబ్దంగా అంతమొందించడంలో ఆయన చూపిన పోలీస్ కరుకుదనం యావత్ దేశ ప్రశంసలు అందుకొన్నది. దేశంలోని మరే రాష్ట్రం కూడా ఈ సమస్యను ఇంత సమర్ధవంతంగా నియంత్రించలేక పోయింది. కేంద్ర హోంమంత్రి చిదంబరానికి అరవిందరావు అంటే ఎనలేని ప్రేమ, అభిమానం. ఛత్తీస్‌గడ్, జార్ఖండ్ రాష్ట్రాలలో నక్సల్ సమస్యను ఎదుర్కోవడానికి ఆయన అరవిందరావు సలహాలే తీసుకొన్నాడని చెప్తారు.

శ్రీకృష్ణ కమిటీ నివేదిక తర్వాత రాష్ట్రంలో తలెత్తబోయే శాంతిభద్రతల సమస్యను ధీటుగా ఎదుర్కోవాలంటే డిజిపి స్థానంలో సమర్థతకు మారు పేరనదగిన వ్యక్తి వుండాలనే వాదనతో గవర్నర్ గారు స్వయంగా జోక్యం చేసుకొని అరవిందరావును ఎంపిక చేయించారని తెలుస్తున్నది. ఈ విషయంలో రోశయ్య మాట చెల్లుబాటు కాలేదు.

దానికి తోడుగా ఎపిపిఎస్‌సి నిర్వహించిన గ్రూప్ వన్ పరీక్షల వివాదాన్ని కూడా గవర్నర్ స్వయంగా పర్యవేక్షించారని తెలుస్తున్నది. ఈ పరీక్షలు జరపరాదని, తెలంగాణాకు కోటా ఇచ్చే వరకు వాయిదా వేయాలని కెసిఆర్ వంటి ప్రతిపక్ష నేతలతో పాటు, కెకె వంటి సీనియర్ కాంగ్రెస్ నాయకుడు కూడా ఆందోళన చేశాడు. తెలంగాణా కాంగ్రెస్ ఎమ్మేల్యేలందరూ ముఖ్యమంత్రి మీద ఒత్తిడి తెచ్చారు. రోశయ్య పద్ధతి అయితే, ఆ ఒత్తిడికి తలవొగ్గి, పరీక్షలు వాయిదా వేసి వుండాలి. కానీ గవర్నర్ జోక్యం చేసుకొని, ముఖ్యమంత్రికి ధైర్యం చెప్పి, ఎట్టి పరిస్థితుల్లోనూ పరీక్షలు జరిపి తీరాలని పోలీస్‌కు ఆదేశాలిచ్చి, పట్టు నెరవేర్చుకొన్నాడు. ఇది అందరికీ తెలిసిన రహస్యం.

విశ్వవిద్యాలయాల పాలనను గవర్నర్ నేరుగా పర్యవేక్షిస్తున్నాడు. తెలంగాణా, నక్సల్ ఉద్యమాలకు విశ్వవిద్యాలయాలే కీలక స్థావరాలు కాబట్టి, వాటిలో పరిస్థితులు చక్కదిద్దితే, ఆ ఉద్యమాలు దారికి వస్తాయన్న అభిప్రాయంతో గవర్నర్ విశ్వవిద్యాలయాల పాలనను తానే నడిపిస్తున్నాడు. విసిల నియామకంలో కూడా తన మాటే నెగ్గించుకొన్నాడు. రోశయ్య నిమిత్తమాత్రుడిగా వుండి పోతున్నాడు.

మొత్తం మీద రాష్ట్ర పాలన ముఖ్యమంత్రి చేతులలో నుంచి జారిపోయి, గవర్నర్ చేత చిక్కిందన్నది బహిరంగ రహస్యమని భావించవచ్చు. ముందు ముందు రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించాల్సిన పరిస్థితి ఏర్పడితే ఇబ్బంది లేకుండా ఇప్పటి నుంచే పాలనను తన చేతుల మీదుగా జరిపిస్తున్నాడాయన. రోశయ్య స్థానంలో మరే ముఖ్యమంత్రి వున్నా దీన్ని రాజ్యాంగేతర అధికార దుర్వినియోగంగా చిత్రించి, గోలచేసి వుండే వారు. కానీ రోశయ్య మాత్రం అధికార పీఠం తన దగ్గరే వుంచి, పాలన తలనొప్పి మరొకరు భరించడం తన మంచికే అని భావిస్తున్నాడు. దానితో గవర్నర్ గారి ఉత్సాహానికి అడ్డంకి లేకుండా పోతున్నది.

# దేశ భవిష్యత్తు ఉపాధ్యాయుల చేతిలోనే వుంది!

## నెల్లూరులో ఘనంగా జరిగిన గురుపూజోత్సవం!



జడ్పీలో జరిగిన ఉపాధ్యాయ దినోత్సవం వేడుకల్లో సర్వేపల్లి రాధాకృష్ణన్ చిత్రపటానికి నివాళులర్పిస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి. ప్రక్కన డిఇఓ బాలకాశయ్య, ఎమ్మెల్సీ బాలసుబ్రహ్మణ్యం, జడ్పీ సిఇఓ రామిరెడ్డి.

మాజీ రాష్ట్రపతి, దివంగత సర్వేపల్లి రాధాకృష్ణన్ జయంతిని గురుపూజోత్సవంగా జరుపుకోవడం ఆనవాయితీ. ఆ రోజున విద్యార్థులకు ఉత్తమ బోధన అందించడమేకాక పలువురికి మార్గదర్శకంగా నిలచే ఉపాధ్యాయులకు అవార్డులనిచ్చి సన్మానించడం ప్రతి ఏటా జరుగుతుంది. దీనిలో భాగంగానే సెప్టెంబర్ 5న గురుపూజోత్సవాన్ని పురస్కరించుకొని జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో జిల్లాస్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయులుగా ఎంపికైన 52 మందిని సన్మానించారు. ప్రధానోపాధ్యాయులు, సెకండరీ గ్రేడ్, స్కూలు అసిస్టెంట్ల నుంచి ఎంపిక చేసిన వారికి ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారాలను అందజేశారు.

సమాజంలో కీలకపాత్ర ఉపాధ్యాయులదేనని, విద్యార్థులను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దే గురుతర బాధ్యత వారిపై వుందని ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి పేర్కొన్నారు. పాఠశాలకు వచ్చాం, పోయాం అన్నట్లుగా కాకుండా చక్కని విద్యాబోధన చేసి పలువురికి ఆదర్శంగా నిలవాలన్నారు. సమాజ గతిని మార్చేశక్తి ఉపాధ్యాయుడికి వుందన్న సంగతిని గుర్తెరిగి ఆ దిశగా తమవంతు కృషి చేయాలన్నారు. దేశ భవిష్యత్తు ఉపాధ్యాయుల చేతుల్లో వుందని జిల్లా కలెక్టర్ రాంగోపాల్ గుర్తు చేశారు. విద్యార్థులకు, ఉపాధ్యాయులకు మధ్య అనుబంధం తగ్గిపోతున్నదని ఆవేదన చెందారు. పాఠశాలల్లో ఎక్కువ సమయం విద్యార్థులు వుంటున్నందున వారితో సంబంధ బాంధవ్యాలు చక్కగా వుండేలా చూసుకోవాలని సూచించారు. రాను రాను పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య తగ్గిపోతుందని, పలు పాఠశాలలు మూత పడుతున్నాయని దీనిపై టీచర్లు ఆత్మ విమర్శ చేసుకోవాలని శాసన మండలి సభ్యుడు విఠపు బాలసుబ్రహ్మణ్యం వ్యాఖ్యానించారు. జిల్లా పరిషత్‌లో విద్యార్థుల సంఖ్య పెరుగుతుంటే, ప్రాథమిక పాఠశాలల్లో వారి సంఖ్య తగ్గిపోతున్నదన్నారు. అనంతరం ఉపాధ్యాయులకు అవార్డులను ప్రదానం చేశారు.

ఆంధ్రప్రదేశ్ ట్యుటోరియల్ అండ్ కాన్వెంట్స్ అసోసియేషన్(ఎపిటిసిఎ) ఆధ్వర్యంలో ప్రైవేట్ స్కూళ్లలో పనిచేసే టీచర్లలో 184 మందిని ఎంపిక చేసి ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారాలను ప్రదానం చేశారు. ఎపిటిసిఎ అధ్యక్షుడు కర్తం ప్రతాప్‌రెడ్డి ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథులుగా నగర, రూరల్ శాసనసభ్యులు ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఆనం వివేకానందరెడ్డిలు హాజరై గత తొమ్మిదేళ్లుగా ప్రైవేట్ స్కూలు టీచర్లకు ఉత్తమ ఉపాధ్యాయ అవార్డులను ఇస్తున్న అసోసియేషన్ సేవలను అభినందించారు. సుదీర్ఘకాలంగా పాఠశాలను నిర్వహిస్తున్న 34 మంది కరస్పాండెంట్లను ఈ సందర్భంగా సన్మానించారు.

గురుపూజోత్సవం సందర్భంగా అటు ప్రభుత్వ ఉపాధ్యాయులకు, ఇటు ప్రైవేట్ టీచర్లకు ఉత్తమ ఉపాధ్యాయ అవార్డులనిచ్చి కార్యక్రమాలు నిర్వహించడంతో నగరంలో ఉపాధ్యాయుల సందడి కన్పించింది.

## వైఎస్ విగ్రహ ఏర్పాటును అడ్డుకొని

# పలుచనైన ఆనం సోదరులు!

తగువెట్లా వస్తుంది జంగం దేవరా అంటే బిచ్చం పెట్టవే బొచ్చు ముండా అన్నాడట. నెల్లూరులో వైఎస్.రాజశేఖర్‌రెడ్డి విగ్రహ స్థాపన వివాదంలో ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ప్రవర్తించిన తీరు ఈ సామెతను గుర్తుకు తెస్తున్నది. ఓదార్పు యాత్రలో భాగంగా జగన్ నెల్లూరు పర్యటనకు వస్తున్న సంగతి అందరికీ తెలుసు. యాత్ర అంటే దారి పొడవునా విగ్రహాలు స్థాపించుకొని వెళ్లడమే అన్న వివరమూ తెలుసు. మారుమూల పల్లెటూళ్లలో కూడా విగ్రహాలు పెడుతున్న జగన్, నెల్లూరు వంటి పెద్ద నగరంలో ఒక్క విగ్రహమైనా ఆవిష్కరించకుండా వెళ్లడని పసిపిల్లవాడినడిగినా చెప్తాడు. నెల్లూరు నగరంలో చీమ చిటుక్కుమనాలన్నా తన అనుమతి కావాలన్నది వివేకా అభిలాష. గత ఆరేడేళ్లుగా వైఎస్‌కు వీరభక్తులుగా చలామణి అవుతున్న తామే వైఎస్ విగ్రహాన్ని సైతం స్థాపించాలన్నది కోరిక. కానీ ఇప్పటి రాజకీయ పరిణామాలు అందుకు అనుకూలంగా లేవు. జగన్ ఓదార్పు యాత్రను కాంగ్రెస్ అధిష్టానం అంగీకరించడం లేదు. దానిలో పాల్గొంటే పార్టీకి వ్యతిరేకం చేసినట్లే అని స్పష్టం చేసింది. ఆ యాత్రలో పాల్గొంటే మంత్రిత్వాన్ని వదలుకోవాలి. పెళ్లాం పక్కింటి వాడితో లేచిపోయి, ఎదురింట్లో కాపురం పెట్టినా సహిస్తారు కానీ మంత్రి పదవి మాత్రం వదలుకోలేరని మన రాజకీయవాదుల గురించి రక్తకన్నీరు నాటకంలో నాగభూషణం ఎప్పుడో చెప్పాడు. ఆ సూత్రం ఆనం వారికి కూడా వర్తిస్తుంది కదా? అందువల్లనే వారు ఓదార్పు యాత్రకు దూరం జరిగిపోయారు.

అమ్మ పెట్టదు అడుక్క తిన్నివ్వదు అన్నట్లు వ్యవహరిస్తే జగన్ వూరకుంటాడా? రాజకీయ వీర కిశోరం వంటి కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డిని రంగంలోకి దించాడు. సేవించుటే తప్ప సేవలందుటకు వీలు చిక్కనివాడు శ్రీధర్‌రెడ్డికి ఇదొక బంగారు అవకాశం. వెంటనే అందిపుచ్చుకున్నాడు. ఓదార్పు యాత్ర భారం మొత్తం తన భుజాల మీద వేసుకొన్నాడు. శ్రీధర్‌రెడ్డి శక్తిని తక్కువ అంచనా



కొత్తహాల్ సెంటర్‌లో వైఎస్ విగ్రహ ఏర్పాటుకు ప్రయత్నించిన కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి బృందంతో మాట్లాడుతున్న ఆర్డీఓ వేణుగోపాల్‌రెడ్డి.

కొరవ 14వ పేజీలో





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.